Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు స్థాపితం: 1930 జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్ రైతు

సంపుటి: 82 • సంచిక: 33 • 19-8-2011 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





# సిబిఐకి అంత తొందరెందుకు?



హైకోర్టు ఆదేశాన్ని సంపూర్ణంగా శిరసా వహిస్తున్నది సిబిఐ. జగన్ ఆస్తుల మూలాలు వెతికే పనిలో తల మునకలుగా నిమగ్నమైంది. అది ఎవరూ తప్పు పట్టలేని విషయం. న్యాయస్థానాలు ఇచ్చిన తీర్పులను అమలు చేయడం ఏ ప్రభుత్వ విభాగానికైనా తప్పనిసరి. కానీ ఆ అమలులో సిబిఐ అధికారులు చూపిన అత్యుత్సాహమే కొంత ఆశ్చర్యానికి గురి చేస్తున్నది.

తన మీద హైకోర్టు తీర్పు వచ్చిన వెంటనే, దాన్ని నిలుపు చేయమని సుప్రీంకోర్టుకు వెళ్లాడు జగన్. మంగళవారం ఆయన అప్పీల్ దాఖలైంది. ఒకటి రెండు రోజులలోనే అది విచారణకు వచ్చే అవకాశం వుంది. కానీ బుధవారానికంతా సిబిఐ అధికారులు పూర్తిస్థాయి దర్యాప్తుకు సిద్ధమైపోయారు. చెన్నై, బొంబాయి, రాంచీ, ఢిల్లీ వంటి సుదూర నగరాలలో తమ తమ విభాగాలను అప్రమత్తం చేశారు. బెంగుళూరు, విశాఖపట్టణాల నుంచి పెద్ద సంఖ్యలో అధికారులను సమీకరించారు. నాంపల్లి కోర్టు మేజిస్ట్రేట్ నుంచి సెర్చ్ వారంట్ పొందారు. బేస్తవారం తెల్లారే సరికల్లా జగన్‌కు సంబంధించిన కార్యాలయాలు, ఇళ్లన్నింటిలో సోదాలకు బృందాలను రంగంలో దింపారు. అంతా చకా చకా, సినిమా రీళ్లు తిరిగినట్లు జరిగిపోయింది.

హైకోర్టు తీర్పులను సిబిఐ పాటించడం తప్పు పట్టవలసిన విషయం కాదు కానీ, అందుకు వారు చూపిన తొందరే అందరి దృష్టి ఆకర్షిస్తున్నది. ఇందుకు ఒక కారణం – జగన్ అక్రమ లావాదేవీలు, అక్రమ ఆస్తుల మీద అప్పటికే సిబిఐ దగ్గర పూర్తిస్థాయి సమాచారం వుండడం కావచ్చు. సిబిఐకి ఇదేమీ కొత్త కేసు కాదు. జగన్ మీద గత నాలుగైదేళ్లుగా లెక్కలేనన్ని ఆరోపణలు వచ్చాయి. విదేశాల నుంచి తరలించిన సొమ్ము, అందుకోసం చేసిన లావాదేవీలు అమెరికాకు చెందిన ఎఫ్‌బిఐ

కొరవ 14వ పేజీలో

# ఆనమోళ్ల ఆక్రోశానికి కారణం!

వైఎస్ జగన్ మీద విరుచుక పడుతున్నారు ఆనం సోదరులిద్దరూ. అనరాని మాటలు అంటున్నారు. రాజకీయ విమర్శలకు బదలు నోటి దూల తీరే తిట్లకు లంఘించుకొంటున్నారు. వారు అంత ఆక్రోశపడడానికి కారణమేమిటో తెలియడం లేదు. వైఎస్ స్వర్ణయుగంలో బంగారు పంటలు పండించుకొన్న రాజకీయవాదులలో ఆనమోళ్లు కూడా ఒకరు. నెల్లూరుజిల్లాలో నేదురుమల్లి జనార్ధన్‌రెడ్డి వంటి సీనియర్ నేత ఉన్నప్పటికీ, ఆయన్ను కాదని వారికి పెద్ద పీట వేశాడు వైఎస్. దాన్ని ఆసరాగా తీసుకొని అటు రాజకీయంగా, ఇటు ఆర్థికంగా ఎదిగారు ఇద్దరూ. అంతకుక్రితం కేవలం నేదురుమల్లి అనుచరులుగా మాత్రమే జిల్లాలో మెలిగిన వారు కాస్తా, జిల్లా నేతలుగా ప్రతిష్ట పెంచుకొన్నారు. అందుకోసం వైఎస్ బ్రతికి వున్నంతకాలం ఆయనకు కుడి ఎడమలం మేమే అన్నట్లు కనిపించడానికి తాపత్రయపడేవారు. 2004లో ఎమ్మెల్యేలుగా గెలిచే నాటికి వారిద్దరి వద్ద స్వంత సైకిల్ కూడా లేదు. కానీ ఇప్పుడు వారిద్దరూ వందల కోట్ల రూపాయల ఆస్తులకు అధిపతులు. వారి ఇంట్లో వున్న కార్లని మాత్రమే లెక్కించినా పది పన్నెండు కోట్ల రూపాయల విలువ చేస్తాయి. నెల్లూరు నగరంలో దాదాపు ఇరవై అపార్టుమెంట్లు వున్నాయి. హైదరాబాదులోని ఆస్తుల విలువ అనంతం. ఈ మధ్యనే మాదాపూరులోని ఒక ఖరీదైన భవంతిలో పదహారవ అంతస్తులో ఇల్లు కొన్నారు. దాని ఇంటీరియర్ ఖర్చే కోట్లలో వుంది. బెంగుళూరులో కూడా వందల కోట్ల రూపాయలు విలువ చేసే భూములున్నాయి.

తమ జీవితాలను ఇంతగా బంగారుమయం చేసిన వైఎస్ రాజశేఖర్‌రెడ్డి కుటుంబం పట్ల మరొకరు అయితే జన్మంతా రుణపడి వుండేవారు. కానీ విచిత్రంగా ఆనం సోదరులిద్దరూ జగన్ మీద వంటి కాలి మీద కయ్యానికి వెళ్తున్నారు. వివేకానందరెడ్డి ఒక్కడే అయితే కొంత వరకు అర్థం చేసుకోవచ్చు. ఆయన నోరు మునిసిపల్ చెత్తకుండీతో సమానం. కుళ్లు కంపు తప్ప దానిలో నుంచి సువాసనలు రావు కాబట్టి ఎవరూ పెద్దగా పట్టించుకోరు. కానీ రామనారాయణరెడ్డి కూడా వంత పాడడమే ఆశ్చర్యం కల్గించే విషయం. జగన్ వంటి కొడుకు ఏ తండ్రికీ పుట్టకూడదని కటువుగా వ్యాఖ్యానించాడు రామనారాయణరెడ్డి.

కొరవ 14వ పేజీలో

# నిరాశకు చిహ్నం అన్నా

అన్నా హజారే చరిత్ర సృష్టించాడు. నిన్న మొన్నటి వరకు పేరు కూడా తెలియని ఒక వ్యక్తి పిలుపుకు జాతి మొత్తం అనూహిత స్పందన చూపడం నిజంగా చరిత్రలో నిలిచిపోయే పరిణామం. అన్నా నామస్మరణ జరగని ఇల్లు దేశం మొత్తంలో వెతికి చూసినా కన్పించదిప్పుడు. విద్యావంతులైన యువతరానికి ఆయనొక రోల్ మాడల్‌గా మారిపోయాడు. ఆయన చేపట్టిన ఉద్యమంలో పాలు పంచుకోవడం ఒక ఘనతగా యువతరం భావిస్తున్నది. ఎయిర్ కండిషన్డ్ గదులలో, కడుపులో చల్ల కదలకుండా, కంప్యూటర్లే ప్రపంచంగా బ్రతికే కుర్రకారు, జెండాలు భుజాన వేసుకొని వీధులలోకి వస్తున్నారు. గొంతెత్తి నినాదాలు చేస్తున్నారు. పోలీసు లాఠీలకు ఎదురు నిలుస్తున్నారు. అన్నా వెంట నడవడానికి పోటీ పడుతున్నారు. అన్నాను అరెస్ట్ చేశారన్న వార్త వెలువడిన పక్క క్షణం ఆసేతు హిమాచలం ప్రజలలో కన్పించిన స్పందన ఆశ్చర్యకరమైనది. అద్భుతమైనది.

అన్నాకు ఇంత జనాదరణ ఎందువల్ల? ఆయనేమీ గాంధీ మహాత్ముడు కాదు. గాంధీ ఆదర్శాలను ఆచరించే సాధారణ వ్యక్తి మాత్రమే. మహారాష్ట్ర సరిహద్దులు దాటి ఆయన పేరు తెలిసినవారు పరిమితం. దానికంటే ముఖ్యంగా ఈ రోజు అన్నా కోసం వీధి పోరాటానికి సిద్ధమౌతున్న లక్షలాది మందిలో లోక్‌పాల్ బిల్లు అంటే ఏమిటో తెలిసినవారు చాలా చాలా కొద్ది మంది. అన్నా చేస్తున్న పోరాటం రాజకీయ అవినీతికి వ్యతిరేకం అన్న నిజం ఒక్కటే ప్రజలకు తెలుసు. రాజకీయ అవినీతి పట్ల జనంలో ఎంతటి క్రోధావేశాలు, ఏమీ చేయలేకపోతున్నామన్న నిస్సహాయత, నిరాశ నిస్పృహలే అన్నా హజారేకు వెయ్యేనుగుల బలం సమకూర్చి పెడుతున్నాయిపుడు.

గత పది పన్నెండేళ్లుగా గ్రామ పంచాయితీ స్థాయి నుంచి ప్రధాన మంత్రి కార్యాలయం వరకు దాదాపు ప్రతి రోజూ ఏదో ఒక అవినీతి కుంభకోణం వెలికి వస్తున్నది. రాజకీయవాదులు జనం కళ్ల ముందే కుబేరులుగా అవతారం ఎత్తుతున్నారు. ఎన్నికలలో కోట్ల రూపాయలు క్రుమ్మరిస్తున్నారు. ఆ తర్వాత వందల కోట్లు కూడ బెట్టుకొంటున్నారు. దాన్ని చూసి తాలూకాఫీసు గుమస్తా నుంచి, ఢిల్లీ స్థాయి కార్యదర్శుల వరకు అధికార గణం సమస్తం అవినీతి బురదలో పందుల వలె పొర్లాడుతున్నది. జనానికి అది కంపరంగా వుంది. కానీ ఏమీ చేయలేని నిస్సహాయ స్థితి. ఎన్నికలలో ఎవరికి ఓటు వేసినా పరిస్థితి అదే అయినప్పుడు జనం చేయగల్గింది ఏమి వుంది? ఈ నిరాశాపూరిత వాతావరణంలో, అన్నా హజారే ఒక ఆశాకిరణం వలె కన్పడుతున్నాడు. దానితో జనం మూకుమ్మడిగా ఆయన వెనుక నిలుస్తున్నారు. దేశానికి ఇదొక శుభ పరిణామమే తప్ప, బాధ పడవలసింది కాదు.

అయితే అన్నా హజారే పోకడ పూర్తిగా సమర్ధనీయంగా లేదు. ఆయన, ఆయనతో చేరిన నలుగురు కలిసి మొత్తం దేశ పాలనా వ్యవస్థను, పార్లమెంటును గుప్పెట్లో పెట్టుకోవాలని ప్రయత్నించడం చాలా ప్రమాదకర పరిణామం. వారెంత మంచివారే అయినప్పటికీ, వారి భావాలే ప్రభుత్వాలు ఆచరించాలని పట్టుబట్టడం సమర్ధనీయమైన పోకడ కాదు. మహాత్మా గాంధీతో అన్నా హజారేను పోల్చడం సైతం తెలివి తక్కువ పని. గాంధీ నడిపిన ఉద్యమాలకు, దీనికి చాలా తేడా వుంది. గాంధీ ఏనాడు కూడా తన భావననే పాటించాలని బ్రిటీష్ ప్రభుత్వాన్ని శాసించలేదు. మాట వినలేదని వారిని పట్టుకొని తిట్టనూ లేదు. ప్రజల స్వాతంత్ర్యేచ్చను ప్రభుత్వం దృష్టికి తేవడం వరకే పరిమితమయ్యాడు. ఓపికగా ఏళ్ల తరబడి పోరాటం చేశాడు. అన్నా హజారేలో ఆ నిగ్రహం లేదు. తన మాట వినలేదని, ప్రధాని మన్మోహన్ సింగ్‌ను పట్టుకొని అబద్దాల కోరని నిందిస్తున్నారాయన. తను చెప్పినట్లే వినాలని ప్రభుత్వాన్ని శాసిస్తున్నాడు. ఆయన వెంట వున్న జనాన్ని చూసి కేంద్ర ప్రభుత్వం సైతం ఆయన ముందు మోకరిల్లక తప్పడం లేదు. ప్రజాస్వామ్యంలో ఎన్నికలు ప్రజాదరణకు సంకేతాలు. అన్నా ఎన్నికలలో పోటీ చేసే వాడు కాదు. కాబట్టి ఆయన జన మద్దతు ఎంతో వూహాగానమే తప్ప, వాస్తవంగా తెలియదు. ఒక్క వ్యక్తి కోసం మొత్తం పార్లమెంట్ తల దించుకోవాలని ఒత్తిడి చేయడం, ఆయన ఎంత గొప్ప వాడైనప్పటికీ దేశానికి క్షేమకరం కాదు. కానీ ప్రజలు అంత మాత్రం ఆలోచన చేసే స్థితిలో లేరు. రాజకీయవాదుల అవినీతి మీద వారు నిప్పులు కక్కుతున్నారు. ఆ నిజాన్ని గ్రహించి, తమ తీరు మార్చుకోవడం రాజకీయ నేతల తక్షణ కర్తవ్యం. లేకుంటే చాలా అనర్ధాలు జరిగిపోతాయి.

జమీన్‌రైతు

## జనవాణి

### ఉపాధ్యాయులు మారాలి!

ఆగష్టు 7వ తేదీ నెల్లూరులో జరిగిన విద్యాసదస్సులో జిల్లాలో ఉపాధ్యాయుల పనితీరుపై కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి వ్యక్తం చేసిన అసంతృప్తి అయినా వారిలో కొంత మార్పు తెస్తుందని ఆశిస్తున్నాను. భావిభారత పౌరులను తయారు చేయవలసిన ఉపాధ్యాయులు ఎంత బాధ్యతారాహిత్యంగా పనిచేస్తున్నదీ కలెక్టర్ గారి ప్రసంగం తేటతెల్లం చేసింది. ఇకనైనా జిల్లాలోని ఉపాధ్యాయులు, వారి సంఘాలు ఒక్కసారి ఆత్మవిమర్శ చేసుకొని వారి బాధ్యతలు సక్రమంగా నిర్వర్తించగలరని భావిస్తున్నాను. సదస్సులో తన అభిప్రాయాలను నిర్మొహమాటంగా, నిష్కర్షగా వెల్లడించిన కలెక్టర్ గారికి అభినందనలు.

*ఎం.కళ్యాణసుందరం* — నెల్లూరు

### దేవుని పేరెందుకు?

వైఎస్ జగన్మోహన్‌రెడ్డి ఆస్తులపై విచారణ జరపమని హైకోర్టు, సిబిఐని ఆదేశించి న్యాయస్థానాల పట్ల గౌరవం పెంచింది. జగన్ ఆస్తులు అనూహ్యంగా పెరగడం వెనుక ఎన్నో అవినీతి కథలు దాగున్నాయి. కానీ ఆయన ఏమాత్రం ప్రాయశ్చిత్తపడక దేముడున్నాడు, అన్నీ చూస్తున్నాడని అనడం సబబుగా లేదు. దేవుడెప్పుడూ నీతిపరుల పక్షాన నిలుస్తాడని జగన్‌కు ఈసారి అనుభవపూర్వకంగా తెలిసి వస్తుంది.

*పి.అరుణకుమారి* — నెల్లూరు

### జడ్పీ పాలనలో మార్పు

గడచిన ఐదేళ్లలో జడ్పీ పాలనలో అనూహ్య మార్పులు సంభవించాయి. ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి ప్రత్యేక శ్రద్ధ తీసుకోవడం వల్ల జడ్పీ ఆదాయం బాగా పెరిగింది. విద్య, వైద్య, ఆరోగ్య రంగాల్లో మంచి పురోభివృద్ధి కనపడింది. క్రీడాకారుల్లో నూతనోత్సాహం వెల్లివిరిసింది. ఉద్యోగులు కూడా తమ విధి నిర్వహణను సక్రమంగా చేశారు. జిల్లా పరిషత్‌కు అందమైన స్వంత భవనం కూడా సమకూరింది. ఇవన్నీ ఒకే వ్యక్తి కాకాణి గోవర్ధన్‌రెడ్డి వల్లే సాధ్యమయ్యాయి. విజయవంతంగా పదవీ బాధ్యతలు నిర్వహించిన ఆయనకు హృదయ పూర్వక వీడ్కోలు.

*గడ్డం తిరుపాలురెడ్డి* — మహమ్మదాపురం

### జమీన్‌రైతులో మార్పు?

జమీన్‌రైతు అన్ని పార్టీలను ఏకిపారేసి ప్రజాపక్షంగా నిలిచినట్లు వుండేది. ఇటీవల కొన్ని వ్యాఖ్యలు చూస్తుంటే ఇటాలియన్ కాంగ్రెస్‌కు మడుగులొత్తినట్లు కనపడుతుంది. పోరాట స్ఫూర్తికి మరోపేరైన 'జమీన్‌రైతు' ఎవరికీ లొంగకూడదు. నెల్లూరీయుల పక్షమే వుండాలి.

*జి.రామయ్య* — నెల్లూరు

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

**23-8-1941**
**పేజీలు : 10 వెల: అణా**

### మోపూరు హత్య!

వెంకటగిరి తాలుకా మోపూరులో కాసరం రామిరెడ్డి భార్య సుబ్బమ్మ అను 16సంవత్సరాల యువతి యొక్క శవం బావిలో తేలియుండగా కనుగొనబడెను. 15తేది భర్త గ్రామంలో లేనట్లు ఆ రాత్రి ఆమె కరణం కొట్టంలో సదరు కరణంతో వుండగా, ఆమె పాత స్నేహితుడున్నూ రాజాగారి కొత్తమణియం అయిన బండి నరసారెడ్డి అనే వ్యక్తి యరమాక వెంకట్రామిరెడ్డి సహాయంతో ఆమెను పట్టుకొని ఈడ్చుకొనిపోయి ఘోరంగా కొట్టి హింసించినట్లు మున్నగు వివరాలు తెలుస్తున్నది. ఈ సందర్భంలో సదరు బండి నర్సారెడ్డిని, యరమాక వెంకట్రామిరెడ్డిని, కుమ్మరి మారెళ్ల మునుస్వామిని పోలీసులు అరెస్ట్ చేశారు. కేసు పోలీసు విచారణలో వుంది తక్కిన వివరాలు వచ్చే మాటు.

### వి.ఆర్.హైస్కూలు

స్కూలు తెరచి రెండు మాసాలైనా మాకు సరిగ్గా పాఠాలు చెప్పడం లేదండి!

–ఒక విద్యార్థి

### ప్లీడరు గుమస్తాల గోడు

నాకు ఐదు మాసాలుగా జీతం ఇవ్వలేదండి. పార్టీల రక్తం ఎన్ని రోజులు తాగి జీవిస్తాం చెప్పండి.

– ఒక గుమస్తా

### రేబాల యుద్ధనిధి

29-7-1941తేదిన జరిగిన పంచాయితీ బోర్డు మీటింగులో యుద్ధ తీర్మానం నెగ్గినందున తిరుగా 30-7-41 తేదీన మీటింగు చేసి రూ.240.00లు ప్యాసు చేయించినారు. వ్యతిరేకులు 3, అనుకూలురు 5గురు. వ్యతిరేకులు వెంటనే రాజీనామా ఇచ్చారు. ఆరు మాసాల నుంచి ఈపూరులో దీపాలు లేవు.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

**18-8-1961**
**పేజీలు: 12 వెల: 0-20 న.పై**

### నెల్లూరు ముచ్చట్లు

### హైకోర్టు స్టే

నెల్లూరులో పెంచబడిన ఇంటి పన్నుల వసూలును తాత్కాలికంగా ఆపుతూ ఆంధ్ర హైకోర్టు న్యాయమూర్తి శ్రీనివాసాచారి నిన్న ఉత్తర్వు జేశారు. నెల్లూరు రేట్ పేయర్ల సంఘ కార్యదర్శి పి.గోపాలరావు వేసిన రిట్ పిటిషన్‌పై న్యాయమూర్తిపై ఉత్తర్వు జేశారట.

### 3వేల నగలచోరీ

కస్తూరిదేవి నగర్‌లో కాపురముంటున్న పి.డబ్ల్యూడి ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు పి.శివరామకృష్ణరావు ఇంట్లో 16తేది రాత్రి రూ.3010ల విలువ గల నగలు, డబ్బు, పెనా చోరీబోయినట్లు తెలుస్తున్నది. దొంగలు మిద్దె మీద నుంచి ఇంట్లోకి ప్రవేశించి ఈ చోరీ జేశారట. పోలీస్ దర్యాప్తు జేస్తున్నది.

### మేనకూరు సుశీలమ్మ దుర్మరణం

బుచ్చిరెడ్డిపాళెం పంచాయతీ అధ్యక్షులు, జిల్లాపరిషత్తు సభ్యులు మేనకూరు గోపాలకృష్ణారెడ్డి సతీమణి శ్రీమతి సుశీలమ్మ 14తేది మధ్యాహ్నం 2.30 ప్రాంతంలో ప్రమాదవశాత్తు రివాల్వరు పేలి దుర్మరణం పాలయినట్లు తెలుస్తున్నది. సుశీలమ్మ వయస్సు 28సంవత్సరాలు. నలుగురు పిల్లలు. అర్థాంగిని కోల్పోయిన గోపాలకృష్ణారెడ్డికి, కుమార్తెను పోగొట్టుకున్న బెజవాడ వెంకటకృష్ణారెడ్డికి, వారి ఆప్త బంధు వర్గానికి మా ప్రగాఢ సానుభూతి తెలియజేస్తున్నాము.

# నెల్లూరు ముచ్చట్లు

## ఎస్పీకి ఇండియన్ పోలీస్ మెడల్

నెల్లూరు ఎస్పీ బి.వి.రమణకుమార్‌కు కేంద్ర ప్రభుత్వం ప్రకటించిన ఇండియన్ పోలీస్ మెడల్‌ను హైదరాబాద్‌లో జరిగిన స్వాతంత్ర్య దినోత్సవపు పెరేడ్‌లో ముఖ్యమంత్రి ఎన్.కిరణ్ కుమార్‌రెడ్డి బహూకరించారు. హైదరాబాద్‌లోని రాజీవ్‌గాంధీ అంతర్జాతీయ విమానాశ్రయంలో సెక్యూరిటీ విభాగంలో అత్యుత్తమ సేవలకుగాను రమణ కుమార్‌ను ఇండియన్ పోలీస్ మెడల్ వరించింది. పోలీసు శాఖలో ఈ పతకం పొందడం గొప్ప గౌరవంగా భావిస్తారు. దాన్ని పొందిన ఎస్పీ గారికి మా అభినందనలు.

## అగ్రజుడు భారతీయం - సోదరుడు విదేశీయం!

65వ స్వాతంత్ర్య దినోత్సవాన్ని పురస్కరించుకొని నెల్లూరు పోలీస్ పెరేడ్ గ్రౌండ్‌లో జరిగిన జాతీయ జెండా ఆవిష్కరణకు ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి ఈసారి ఖచ్చితమైన సమయానికి వచ్చి అందరినీ ఆశ్చర్యపరిచారు. విచిత్రమేమంటే మామూలుగా ధరించే ఖద్దరు బట్టలను వదలి మంత్రి విదేశీయునిలా సూట్ వేసుకొని "ఆడి" కారులో రాగా ఆయన అగ్రజుడు నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి మాత్రం తెల్లని గ్లాస్కో పంచె, లాల్చీ ధరించి ఈ వేడుకలో పాల్గొన్నారు.

## స్వాతంత్ర్య యోధుల్లో ఎసి పేరు!

స్వాతంత్ర్య పోరాటంలో జిల్లా నేతలు ఎందరో పాల్గొన్నారు. కానీ ఆగష్టు 15వ తేది పోలీస్ పెరేడ్ గ్రౌండ్‌లో మంత్రి ఆనం రామనారాయణరెడ్డి చదివిన ఉపన్యాసంలో పాత తరం నేతల పేర్లు తగ్గిపోయాయి. ఈసారి ఈ జాబితాలో కొత్తగా ఎసి సుబ్బారెడ్డి పేరు చోటుచేసుకొంది. ఏళ్లు గడిచే కొద్దీ కొత్త స్వాతంత్ర్య సమరయోధులను జిల్లా యంత్రాంగం జాబితాలో చేర్చేస్తుందా?

## రాజకీయ అవినీతి గూర్చి మాట్లాడిన వివేకా!

దేశం బాగుపడాలంటే రాజకీయాల్లో అవినీతి అంతమవ్వాలని రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి అభిలషించారు. ఆగష్టు 15ను పురస్కరించుకొని ములుమూడి బస్టాండ్‌లో జాతీయ జెండాను ఆవిష్కరించి మాట్లాడారు. రాత్రికి రాత్రే కోటీశ్వరులవుతున్న వారు రాజకీయ రంగంలో ప్రవేశించి ప్రజాస్వామ్యాన్ని అవహేళన చేస్తున్నారని మాట్లాడారు. ఈ కార్యక్రమానికి విచ్చేసిన జనం వివేకా ఎవరిని ఉద్దేశించి ఈ వ్యాఖ్యలు చేశారన్న సందిగ్ధంలో పడ్డారు.

## ప్రజల కోసమే రాజకీయాల్లో...

ప్రజల కోరిక మేరకే తాను రాజకీయాల్లో కొనసాగుతున్నానని మాజీ మేయర్ భానుశ్రీ 'సూర్య' దినపత్రికకు ప్రత్యేకంగా ఇచ్చిన ఇంటర్వ్యూలో పేర్కొన్నారు. నాకు రాజకీయాల పట్ల మక్కువ లేదు. కులాల చిచ్చు, పురుషాహం కారంతో ప్రస్తుతం రాజకీయాలు నడుస్తున్నాయి. తాను మేయర్‌గా పనిచేసే రోజుల్లో పత్రికల్లో ఒక్క నెగటివ్ వార్త వచ్చినా అవమానంగా భావించే దాన్నని; కానీ ఇప్పటి నాయకులకు ఉలుకు పలుకు లేదని మాజీ మేయరమ్మ నీతులు చెప్పారు.

## వాళ్లు ఎదగకూడదా?

దళితుల పట్ల జిల్లా అధికార యంత్రాంగానికి వుండే భావన 65వ స్వాతంత్ర్య దినోత్సవం సందర్భంగా పోలీస్ పెరేడ్ గ్రౌండ్‌లో ప్రదర్శించిన అభివృద్ధి శకటాల ద్వారా వెల్లడయ్యింది. ఎస్సీ కార్పొరేషన్ శకటం ముందు మాదిగల తప్పెట్లు, చిందు ఏర్పాటు చేశారు. గిరిజన సంక్షేమ శాఖ అయితే యానాదులకు కీలు గుర్రాల ఆటతో అభివృద్ధి చెందినట్లు నృత్యాన్ని ఏర్పాటు చేయడం విమర్శకు దారితీసింది.

## వైఎస్‌ఆర్ కాంగ్రెస్ సభ్యత్వం 30వేలు!

నెల్లూరు నగరంలో వైఎస్‌ఆర్ కాంగ్రెస్ పార్టీలో 30వేల మంది సభ్యులుగా నమోదయ్యారు. నగరంలో వివిధ ప్రాంతాల్లో ప్రత్యేక సమావేశాలు ఏర్పాటు చేసి సభ్యత్వాలను నమోదుచేసిన పోలుబోయిన అనిల్‌కుమార్ యాదవ్ దీని ద్వారా వచ్చిన ఎనిమిది లక్షల తొంభై నాలుగువేల రూపాయలను పరమేశ్వరి కళ్యాణ మండపంలో జరిగిన ప్రత్యేక సమావేశంలో పార్టీ జిల్లా అధ్యక్షుడు కాకాణి గోవర్ధన్‌రెడ్డికి అందించారు. ఈ కార్యక్రమంలో నెల్లూరు ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి కూడా పాల్గొన్నారు.

## వార్డెన్లలో రాక్షసత్వం

సాంఘిక సంక్షేమ శాఖ హాస్టళ్లలో పనిచేసే వార్డన్లలో రాక్షసత్వం పెరిగిపోయిందని ఇటీవల జిల్లాలోని వివిధ ప్రాంతాల్లో జరుగుతున్న సంఘటనలు నిరూపిస్తున్నాయి. హాస్టళ్లలో బాలికలు, బాలురపై లైంగిక వేధింపుల ఘటనలు మర్చిపోక ముందే తనకు మద్యం బాటిళ్లు తెచ్చివ్వని బాలుడిని చేజర్ల మండలం తూర్పు కంభంపాడు ఎస్సీ బాలుర వసతి గృహం వార్డెన్ తీవ్రంగా హింసించడంతో ప్రతాప్ అనే బాలుడు చెన్నై హాస్పిటల్‌లో చికిత్స పొందుతూ మరణించాడు. 14వ తేది వార్డెన్ బ్రహ్మయ్యను ఆత్మకూరు డిఎస్పీ సిద్దారెడ్డి ఏర్పాటుచేసిన ప్రత్యేక పోలీసు బృందం అదుపులోకి తీసుకొంది.

## తేలిగ్గా తీసుకోవద్దు!

వ్యవసాయ రంగంలో ప్రస్తుతం ఏర్పడిన సంక్షోభానికి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు బాధ్యత వహించాలని బిజెపి జాతీయ నేత వెంకయ్యనాయుడు విమర్శించారు. 14వ తేది వెంకటాచలంలోని స్వర్ణభారత్ ట్రస్ట్‌లో ఆయన విలేకరులతో మాట్లాడారు. వరికి గిట్టుబాటు ధర కల్పించడంలో ప్రభుత్వాలు విఫలమవడం వల్లే క్రాప్ హాలిడే సంక్షోభం వచ్చిందన్నారు. వ్యవసాయంపై స్వామినాధన్

కొరవ 14వ పేజీలో

## జమీన్‌రైతు సారథి



జమీన్‌రైతు రథ సారథిగా తన ఊపిరి వున్నంత కాలం సేవ చేసి తాను లేకున్నా కలకాలం జమీన్‌రైతు నిలిచేట్టు శ్రమించిన నిస్వార్థజీవి, జమీన్‌రైతు మేనేజింగ్ ఎడిటర్

**తూపిలి పార్ధసారథి గారు**

తనువు చాలించి 20తేదికి 32 సంవత్సరాలు నిండుతాయి. వారిని సంస్మరిస్తూ...

**... జమీన్‌రైతు కుటుంబం**

# అల్లరి మూకల ఆగడాలు!

## ఇబ్బంది పడుతున్న యువతులు, మహిళలు

నెల్లూరు నగరంలో అల్లరి మూకల ఆగడాలు అధికం అవుతున్నాయి. మహిళలను పలు రకాలుగా వేధింపులకు గురిచేస్తుండడంతో వారు ఇంట్లో నుంచి బయటకు రావాలంటేనే హడలిపోతున్నారు. కళాశాలలు, కోచింగ్ సెంటర్లు, దేవాలయాలు, బస్టాపుల వద్ద వుండే రౌడీమూకలు మహిళలను అల్లరి పెడుతున్నా పట్టించుకొనే వారే లేకుండా పోయారు. జిల్లా ఎస్పీ రమణకుమార్ ఈవ్‌టీజింగ్‌ను అరికట్టేందుకు కఠిన చర్యలు తీసుకొంటామని ప్రకటించినా అవి కేవలం ప్రకటనలకే పరిమితం అవుతున్నాయి తప్ప అమలుకు నోచుకోవడం లేదు. క్రిందిస్థాయి సిబ్బంది ఉన్నతాధికారుల ఆదేశాలను పట్టించుకోకపోవడంతో రోజురోజుకూ అధికం అవుతున్నాయి మహిళలపై వేధింపులు. మానసికంగా చిత్రహింసలకు గురిచేసేలా వెకిలి చేష్టలు, ద్వందార్థపు మాటలతో అల్లరి పెడుతుండడంతో యువతులు వీరి కారణంగా నలిగి పోతున్నారు. దేవాలయాల కేంద్రమైన మూలపేటలో ఈ గ్యాంగ్‌లు రోడ్డుపై నిలబడి అక్కడకు వచ్చే భక్తులను వేధిస్తున్నాయి. మన్సూర్‌నగర్, కోటమిట్ట, కపాడిపాళెం తదితర ప్రాంతాలకు చెందిన అల్లరి చిల్లరగా తిరిగే యువకులు బృందంగా ఏర్పడి ఈవ్‌టీజింగ్‌కు పాల్పడుతున్నారు. విఆర్ కాలేజి, మద్రాసు బస్టాండు, హరనాథపురం తదితర ప్రాంతాల్లో విద్యాసంస్థల వద్ద కాపుకాచి వచ్చిపోయేవారిని పలురకాలుగా అల్లరి చేస్తున్నా స్థానిక పోలీసులు పట్టీపట్టనట్లు వ్యవహరిస్తుండడంతో ఉన్నతాధికారి చేసిన హామీలు మాటలకే పరిమితం అవుతున్నాయి. ఇటీవల మద్రాసుకు చెందిన ఒక యువతి మూలాపేటలోని తన బంధువైన అర్చకుడి ఇంట్లో వుండి చదువుకొనేందుకు వచ్చింది. ఆమె ఇరుగాళమ్మ గుడికి వెళ్లిన సందర్భంలో కొందరు ఆమెను గ్యాంగ్‌రేప్ చేశారు. రూరల్, వన్‌టౌన్లలో దీనిపై ఫిర్యాదు చేసినా ఆ కేసు అతీగతీ లేకుండా పోయింది. చివరికి ఎస్పీ ఆఫీసుకు సమీపంలో గల డికె కళాశాల వద్ద ఈవ్‌టీజింగ్‌లు జరుగుతున్నా పోలీస్ నిద్రావస్థలో వుంది. సెల్‌ఫోన్ రీచార్జి కోసం వెళ్లే సెంటర్ల ద్వారా ఫోన్‌లలో వేధించే వారి సంఖ్య అధికం అవుతోంది. ఇప్పటికైనా ఎస్పీ దీనిపై దృష్టిసారించి మాటలు కాకుండా చేతల్లో ఈవ్‌టీజర్స్ భరతం పట్టాల్సి వుంది.

# కలెక్టర్‌తో కలసిరాని అధికారులు

• సంక్షేమ అధికారులా... మజాకా?

జిల్లాలోని ఎస్సీ, ఎస్టీ, బిసి హాస్టళ్లలో విద్యార్థుల సంక్షేమం కోసం కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి విశేష కృషిచేస్తున్నా సిబ్బందిలో మాత్రం మార్పు రావడం లేదు. మెనూ సక్రమంగా పాటించాలని, విద్యార్థుల సంక్షేమానికి పెద్ద పీటవేయాలని పిల్లలను ఇబ్బందులకు గురిచేస్తే ఉపేక్షించేది లేదని హెచ్చరికలు జారీ చేస్తున్నా హాస్టల్ సిబ్బంది మాత్రం తమదారి తమదే అన్నట్లు ప్రవర్తిస్తున్నారు. ముఖ్యంగా హాస్టల్ సమస్యలను ఉన్నతాధికారుల దృష్టికి తీసుకొని వెళ్లే పిల్లలపై తమ ప్రతాపం చూపిస్తుండడంతో పాపం పసిపిల్లలు వీరి దెబ్బకు హడలి పోతున్నారు. హాస్టల్ వార్డెన్లపై ఫిర్యాదు చేసినట్లయితే సాంఘిక సంక్షేమ శాఖ అధికారులను విచారణకు ఆదేశిస్తున్నారు. వీరు తమకు నెలనెలా మామూళ్లు అందించే సిబ్బందిపై ఈగ వాలకుండా వుండేందుకు, వారిని రక్షించేందుకు తూతూమంత్రంగా విచారణ జరిపి, అంతా సవ్యంగా వుందంటూ ఉన్నతాధికారులకు నివేదికలు ఇవ్వడమే కాకుండా ఆయా హాస్టల్ విద్యార్థులను బెదిరింపులకు గురి చేస్తుండడంతో సమస్యలు చెప్పుకోలేక, చెప్తే హాస్టల్ అధికారుల ఒత్తిడి భరించలేక చిన్నారులు నలిగి పోతున్నారు. ఇటీవల ఒక హాస్టల్ వార్డెన్‌పై పలు ఫిర్యాదులు వచ్చిన నేపథ్యంలో కలెక్టర్ విచారణకు ఆదేశిస్తే ఇలాంటి ఘటనలే చోటుచేసుకొన్నాయి. ఈ పరిస్థితుల్లో సంబంధిత శాఖ అధికారులను కాకుండా రెవిన్యూ, తదితర శాఖల అధికారుల చేత విచారణ జరిపించినట్లయితే పిల్లలు సులభంగా తమ సమస్యలను చెప్పుకొనే సౌలభ్యం ఏర్పడుతుందని పలువురు పిల్లల తల్లిదండ్రులు అభిప్రాయపడుతున్నారు. హాస్టళ్లపై సమీక్షలకే పరిమితం కాకుండా సమస్యలు పరిష్కారం అయ్యేలా చర్యలు చేపడితే కలెక్టర్ విద్యార్థులకు మేలు చేసిన వారవుతారు.



సమీక్షా సమావేశంలో ఎస్పీ రమణకుమార్‌తోపాటు పోలీసు అధికారులు.

# దొంగతనాలు ఆపాలి

జిల్లాలో దొంగతనాలు ఎక్కువగా జరుగుతున్నాయని వాటిని అరికట్టేందుకు ప్రత్యేక బృందాలను ఏర్పాటుచేసి నేరస్తులపై నిఘా వుంచాలని ఎస్పీ బి.వి.రమణకుమార్ ఆదేశించారు. జిల్లా పోలీసు కార్యాలయంలోని తన ఛాంబర్‌లో నెల్లూరు నగర, రూరల్, ఆత్మకూరు సబ్ డివిజన్ల వారీగా నిర్వహించిన క్రైం మీటింగ్‌లో మాట్లాడారు. దొంగతనాలు అరికట్టను పగలు, రాత్రి సమయాల్లో గస్తీ ఏర్పాటు చేయండి. గ్రామీణ ప్రాంతాల్లో మోటార్లు, ట్రాన్స్‌ఫార్మర్లు దొంగతనాలకు గురవుతున్నాయి. వాటిపైనా దృష్టి సారించండి. మోటారు సైకిళ్ల దొంగల పనిపట్టండి. కళాశాలల్లో ఈవ్‌టీజింగ్ జరగకుండా అవగాహన సదస్సులు ఏర్పాటుచేసి విద్యార్థులను చైతన్యవంతం చేయాలన్నారు. ఎస్‌ఎంఎస్‌ల ద్వారా విద్యార్థినులను, మహిళలను వేధించే ఆకతాయిలపై నిఘాపెట్టి వారిపై కేసులు నమోదు చేయాలన్నారు. పోలీసు స్టేషన్‌కు వచ్చే మహిళలు, వృద్ధుల పట్ల మర్యాదపూర్వకంగా మాట్లాడి వారి సమస్యలను తెలుసుకొని సత్వరమే సమస్య పరిష్కారం అయ్యేలా చూడాలని సిబ్బందిని ఆదేశించారు. నెల్లూరు నగరంలో ట్రాఫిక్‌తో ప్రజలు ఇబ్బందులు పడుతున్నారని, ట్రాఫిక్ రూల్స్ పాటించని వాహనాలను సీజ్ చేయడంతోపాటు డ్రైవర్లపై కేసులు నమోదు చేయాలన్నారు. పెండింగ్‌లో వున్న కేసులను త్వరితగతిన పరిష్కరించాలన్నారు. ఈ సమావేశంలో ఎఎస్పీ నాగేశ్వరరావు, నెల్లూరు రూరల్ డిఎస్పీ రవికుమార్, ఆత్మకూరు డిఎస్పీ సిద్ధారెడ్డి, నెల్లూరు నగర, రూరల్ సిఐలు పి.వీరాంజనేయరెడ్డి, జయరామసుబ్బారెడ్డి, సి.హెచ్.వెంకటేశ్వర్లు తదితరులు పాల్గొన్నారు.

# తీరుమారని అయ్యోర్లు!

ఎందరు ఎన్ని హెచ్చరికలు జారీచేసినా ఉపాధ్యాయుల తీరు మారడం లేదు. బడి ఎగ్గొట్టి సొంత వ్యాపారాల్లో మునిగితేలే అయ్యోర్లు తమనెవరూ ఏమీ చేయలేరన్నట్లు వ్యవహరిస్తుండడంతో ఉపాధ్యాయ వ్యవస్థ గాడి తప్పుతోంది. చుట్టపుచూపుగా పాఠశాలకు వెళ్లి సంతకాలు చేయడం, మండల విద్యాధికారులను లోబరుచుకొని సొంత వ్యాపారాలు చక్కబెట్టుకొని, తీరిక ఉన్నప్పుడు స్కూలుకు వస్తున్నారు తప్ప బాధ్యతాయుతంగా పనిచేయడం లేదు. ఇక ఇద్దరు ఉపాధ్యాయులు వుండే పాఠశాలల్లో అయితే వంతుల వారీగా ఒక వారం ఒకరు వస్తే, మరో వారం మరొక టీచరు పాఠశాల మొహం చూస్తుండడంతో విద్యార్థులకు చదువు

## సొంత వ్యాపారాల్లో బిజీ

చెప్పేవారే లేకుండా పోతున్నారు. చిట్‌ఫండ్స్ నిర్వహించడం, చెప్పుల షాపులు, బట్టల షాపులు, రొయ్యల గుంటలు నిర్వహించేవారు, రియల్ ఎస్టేట్ వ్యాపారం చేసేవారు కొందరైతే మరికొందరు ఏకంగా మెడికల్ రిప్రజెంటివ్‌లుగా పనిచేస్తూ బ్యాగ్ పట్టుకొని డాక్టర్లను కలవడంలో బిజీగా వుంటున్నారంటే ఎంత నిర్లక్ష్యంగా ఉపాధ్యాయులు వ్యవహరిస్తున్నారో అర్థం అవుతుంది. ఇటీవల ఒక ఉపాధ్యాయుడు ఏకంగా పాఠశాలకు తాగి వచ్చి మద్యం మత్తులో వీరంగం చేసిన సంగతి తెలిసిందే. ఉపాధ్యాయుల నిర్లక్ష్యంపై ఫిర్యాదులు రావడంతో కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి ఇటీవల ఒక సమావేశం ఏర్పాటుచేసి తీవ్రంగా మందలించారు. కలెక్టర్ హెచ్చరికలతోనైనా గురువులు మారుతారో, లేక మొత్తం ఉపాధ్యాయ వర్గానికే మాయని మచ్చ తెచ్చేలా వ్యవహరిస్తారో చూడాలి.

# 14ఎఫ్ వ్యతిరేక బంద్!



విఆర్ కాలేజిలో తరగతులు బహిష్కరిస్తున్న విద్యార్థులు.

హైదరాబాద్‌ను ఫ్రీజోన్(14ఎఫ్) నుండి తొలగించాలనే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల ఆలోచనను నిరసిస్తూ సమైక్య విద్యార్థి జెఎసి నేతృత్వంలో జరిగిన విద్యాసంస్థల బంద్ నెల్లూరులో విజయవంతమయ్యింది. బంద్‌ను పురస్కరించుకొని జిల్లాలోని ప్రైవేటు విద్యాసంస్థలన్నీ స్వచ్ఛందంగా సెలవు ప్రకటించాయి. మరికొన్నింటిని సమైక్య విద్యార్థి జెఎసి నాయకులు మూయించారు. ఈ సందర్భంగా సమైక్య విద్యార్థి జెఎసి కో కన్వీనర్ టోని మాట్లాడుతూ 14ఎఫ్ తొలగింపుపై ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి తొందరపడ్డారు. తెలంగాణవాదులకు భయపడి ఫ్రీజోన్ విషయంలో సీమాంధ్ర ప్రజలకు అన్యాయం చేశారు. తెలంగాణ ప్రాంత ఉద్యోగులు సమ్మెకు పిలుపునిస్తే ప్రభుత్వం భయపడడమేమిటి? 2003 సంవత్సరంలో తమిళనాడు ముఖ్యమంత్రి జయలలిత ఒక్క వేటుతో ఒకటిన్నర లక్ష మంది ఉద్యోగులను తొలగించి వారి స్థానంలో యువకులకు ఉద్యోగం ఇచ్చిన విషయం ఇప్పటి ముఖ్యమంత్రి ఒకసారి మననం చేసుకోవాలన్నారు. జెఎసి ఆధ్వర్యంలో విఆర్‌సి సెంటర్‌లో కాసేపు రాస్తారోకో కూడా నిర్వహించారు.

# దేవాలయాల ప్రతిష్ఠ పెంచాలి

ఎంతో చరిత్రగల ఆలయాలు వాటి ఆస్తులను కాపాడేందుకు, భక్తుల మనోభావాలు దెబ్బతినకుండా చేసే బాధ్యత ధర్మకర్తల మండళ్ల పైనే వుందని స్టేట్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెంపుల్స్ అడ్మినిస్ట్రేషన్ డైరక్టర్ సి.విజయరాఘవాచార్యులు పిలుపునిచ్చారు. దేవాదాయశాఖ ఆధ్వర్యంలో ట్రంకురోడ్డులోని తిప్పరాజు వెంకటసుబ్బయ్య సత్రంలో జరిగిన ధర్మకర్తల మండళ్ల అవగాహన సదస్సులో మాట్లాడారు. దేవాలయాల్లో



సమావేశంలో మాట్లాడుతున్న విజయరాఘవాచార్యులు.

విధులు సక్రమంగా నిర్వహించాలి. కొన్ని పనులు దేవాలయాల్లో చేయకూడదు. చేయకూడని పనులుచేస్తే దుష్ఫలితాలొస్తాయి. దేవాలయాల్లో చేసే మంచి కార్యక్రమాల వల్లే ఆలయాలకు భక్తులధికంగా వస్తారనే విషయాన్ని గుర్తుంచుకొని మండళ్లు నడవాలని సూచించారు. దేవాదాయ శాఖాధికారులు యానాదిశెట్టి, రవీంద్రరెడ్డి, ఎన్.వెంకటరమణ, ధర్మకర్తలు, ధర్మకర్తల మండలి సభ్యులు, పాల్గొన్నారు.

# పంట విరామం వైపు
# నెల్లూరు రైతు అడుగులు

**జిల్లాలో గత ఏడాది రైతులు విస్తారంగా పండించిన జిలకర మసూరి ధాన్యానికి గిట్టుబాటు ధర లేక అల్లాడిపోతున్నారు. వ్యవసాయ ఖర్చులు పెరగడం, గిట్టుబాటు ధర లేకపోవడంతో గోదావరి జిల్లాల రైతుల స్ఫూర్తితో ఈ యేడాది పంట విరామం వైపు అడుగులు వేస్తున్నారు.**



రైతులు పంట విరామం వైపు అడుగులేయడంతో ఖాళీగా వున్న పొలం.

జిల్లాలో రానున్న ఖరీఫ్ సీజన్‌లో పంట విరామం పాటించాలని రైతులు తల పోస్తున్నారు. ఇప్పటికే దీనిపై జిల్లాలోని కొన్ని రైతుసంఘాల్లో సభ్యులైన రైతులు ప్రకటన చేశారు. వరిపంట దిగుబడులు బాగానే వస్తున్నప్పటికి గిట్టుబాటు ధర లేకపోవడంతో వ్యవసాయానికి చేసిన అప్పులు తీర్చలేకపోతున్నారు. వరి పంటకు విరామం ప్రకటించి కూలీ పనులకు వెళ్లడమే మేలని అభిప్రాయం వ్యక్తం చేస్తున్నారు రైతులు. ప్రస్తుతం పట్టణ ప్రాంతాల్లో రోజు వారి కూలీ 350 రూపాయలు. గ్రామీణ ప్రాంతాల్లో 250 రూపాయలు ఇస్తున్నారు.

జిల్లావ్యాప్తంగా రైతులు పంట విరామం ప్రకటిస్తే దాని ప్రభావం వ్యవసాయ అనుబంధ రంగాలపై తీవ్ర ప్రభావం చూపే అవకాశం వుంటుంది. పచ్చని వరిపైర్లతో కళకళలాడాల్సిన మాగాణి భూములు బీడుగా మారే ప్రమాదం లేకపోలేదు. వ్యవసాయ సీజన్‌లో వరిపంట సాగు చేసే రైతాంగం గురించి ప్రభుత్వం సానుకూల నిర్ణయం తీసుకోవడంలో వైఫల్యం చెందుతున్నది. ఇతర జిల్లాల్లో రైతుల మాదిరిగానే మన జిల్లా రైతులు కూడా పంట విరామం పాటించేందుకు సమావేశాలు ఏర్పాటు చేస్తున్నారు. పంట విరామం ప్రకటిస్తామని రైతులు బహిరంగంగానే ప్రకటించినా ప్రభుత్వం స్పందించకపోవడం బాధాకరం.

రైతుల సంక్షేమం గురించి పట్టించుకోవాల్సిన బాధ్యత కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలదేనన్న విషయాన్ని పూర్తిగా పాలకులు విస్మరిస్తున్నారు. రైతు సంఘాలు కూడా రైతులు పండించిన పంటకు గిట్టుబాటు ధర కల్పించాలని పలు దఫాలు విన్నవించుకున్నా పట్టించుకునే దిక్కు లేకుండా పోయారు.

## పెరుగుతున్న ఖర్చు

వ్యవసాయ సాగుకు ప్రతి సీజన్‌లో రెట్టింపు ఖర్చు అవుతుంది. దుక్కి దున్నడం, వరివిత్తనాలు, ఎరువుల కొనుగోలు, పురుగు మందులు అధిక ధరలు పలుకుతున్నాయి. ఎకరా వరిపంటకు 10 నుంచి 15వేల రూపాయల వరకు ఖర్చు చేయాల్సిన పరిస్థితి ఏర్పడింది. పేరుకు వ్యవసాయశాఖ వున్నా ఆ శాఖ అధికారులు రైతులకు అవసరమైన నిర్ణయాలు ఎప్పుడూ తీసుకోరు. రాయితీపై వరి విత్తనాలు, ఎరువులు, పురుగు మందులు సరఫరా చేస్తామని ఆర్భాటంగా ప్రకటనలు చేసి చేతులు దులుపుకుంటారు. ఏ సీజన్‌లో వరిపంట వేయాలి? ఇందుకు అవసరమైన రకాలు ఏమిటి? అన్న సమాచారాన్ని రైతులకు తెలియజేయడంలో చాలా నిర్లక్ష్యంగా వ్యవహరిస్తుంటారు. రైతులకు సరైన అవగాహన లేకపోవడంతో ఇష్టమైన రకాలను వేసుకోవాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది.

మన జిల్లాలో జూన్ నెల నుంచి ఖరీఫ్ సీజన్ మొదలుకావాల్సి వుంది. అయితే సకాలంలో వర్షాలు కురవకపోవడంతో ఆలస్యంగా వరినాట్లు వేస్తుంటారు. సకాలంలో వర్షం వచ్చి నారుమళ్లు పోసుకుంటే వరినాట్లు వేసే సమయంలో కాల్వలకు సాగునీరు విడుదల కాకుండాపోతుంది. ఇవన్నీ కూడా రైతుల పాలిట శాపంగా పరిణమిస్తుంటాయి. వరిపంట సాగుచేయడం రైతులు మానేస్తే భవిష్యత్‌లో ఆహార ధాన్యాల కొరత తీవ్రంగా వుంటుంది. సాగుకు అవసరమైన నీటి నిల్వ వున్నా కూడా కాల్వలకు విడుదల చేయడంలో అధికారులు చొరవ చూపకుండా పోతున్నారు.

గత ఖరీఫ్ సీజన్‌లో పండిన వరి ధాన్యాన్ని కొందరు రైతులు విక్రయించుకోలేక పోతున్నారు. సన్న, చిన్నకారు రైతులు మాత్రం వారి అవసరాల నిమిత్తం గిట్టుబాటు ధర లేకపోయినా వ్యాపారులకు విక్రయించారు. వ్యవసాయ సాగుకు అయ్యే పెట్టుబడి ధాన్యం విక్రయించగా వచ్చే నగదుకు ఏమాత్రం సరిపోవడం లేదని రైతులు వాపోతున్నారు. గతంలో రైతులు పండించిన ధాన్యాన్ని ఆహారం కోసం సంవత్సరం పాటు నిల్వ చేసుకొనేవారు. ప్రస్తుతం కొద్దిమంది రైతులు మాత్రమే ధాన్యాన్ని నిల్వ వుంచుకుంటుండగా, మిగిలిన రైతులు అప్పులు తీర్చేందుకు పొలం నుంచే తరలించేస్తున్నారు.

ఇటీవల రెండవపంట వేసుకునేందుకు ప్రభుత్వం అనుమతిచ్చింది. దీంతో రైతులు రెండవ పంట వేసేందుకు ముందు సన్నద్ధం కాగా, ఆ తర్వాత గిట్టుబాటు ధర దక్కదన్న ఆలోచనతో కొందరు రెండవ పంట వేయడం మానుకున్నారు. ప్రతి సంవత్సరం ఖరీఫ్ సీజన్‌లో 5లక్షల 50వేల ఎకరాలల్లో వరిసాగు చేసేవారు. అయితే ఈ సంవత్సరం ఆశించిన మేర వరిసాగు జరగలేదు. వ్యవసాయశాఖ, నీటి పారుదల శాఖ అధికారుల మధ్య సమన్వయం లేకపోడం వలన వరిసాగుకు సంబంధించి వాస్తవాలు వెల్లడికాకుండా పోతున్నాయి. జిల్లాలో ఎంత వరిసాగు జరిగిందన్న సమాచారాన్ని రెండు శాఖల అధికారులు రెండు విధాలుగా చెబుతుంటారు.

ప్రభుత్వానికి సైతం వాస్తవ నివేదికలు వెళ్లడం లేదు. దేశానికి అన్నం పెట్టే అన్నదాతలను ప్రభుత్వం పూర్తిగా విస్మరిస్తోంది. మన జిల్లాలో విడవలూరు, కలువాయి మండలాలలోని రైతులు ప్రభుత్వం స్పందించి వరికి గిట్టుబాటు ధర కల్పించకుంటే పంట విరామం పాటిస్తామని గతవారం ప్రకటించారు. రైతులు చేస్తున్న విజ్ఞప్తిపై కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు స్పందించాల్సి వుంది. ◆J

### రైతులు సిద్ధపడుతున్నారు



వరి ధాన్యానికి కనీస మద్దతు ధర లేకపోవడంతో పంట విరామం ప్రకటించేందుకు జిల్లా రైతులు సిద్ధపడుతున్నారు. 2లక్షల ఎకరాల్లో రెండవ పంటకు అనుమతి వుంటే 50 వేల ఎకరాల వరిపంట వేయలేదు. పంట వేసినా గిట్టుబాటు ధర వుండదన్న భయమే ఇందుకు కారణం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు స్పందించి పంట విరామం ప్రకటించక ముందే రైతులకు అనుకూల ప్రకటన చేయాల్సిన అవసరం ఎంతైనా వుంది.

***చంద్ర రాజగోపాల్,***
*వ్యవసాయ కార్మిక సంఘం, నెల్లూరు జిల్లా.*

### ప్రకటనలకే పరిమితం



వరి ధాన్యానికి మద్దతు ధర ఇస్తామని చేసిన ప్రకటన కేవలం కాగితాలకే పరిమితమైపోయింది. కొనుగోలు కేంద్రాలలో వున్న అధికారులు ధాన్యంలో తేమ, మట్టి, రాళ్లు వున్నాయంటూ రైతులను ఇబ్బంది పెడుతున్నారు. రైతాంగం సమస్యలపై ఎన్ని ఆందోళనలు చేపట్టినా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు పట్టించుకోవడం లేదు. గిట్టుబాటు ధర లేకపోవడంతో రైతులు పంట విరామం పాటించాలన్న ఆలోచనలో వున్నారు.

***రావూరు సుందరరామిరెడ్డి,***
*తెలుగు రైతు, నెల్లూరు.*

### గిట్టుబాటు ధర ఇవ్వకుంటే పంట విరామం



రైతులు పండించిన వరి ధాన్యానికి గిట్టుబాటు ధర కల్పించకుంటే రైతులు పంట విరామం పాటించక తప్పేట్లు లేదు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు రైతుల సంక్షేమం గురించి పూర్తిగా విస్మరించాయి. వరిసాగు కోసం చేస్తున్న ఖర్చుకు రైతుల విక్రయిస్తున్న ధాన్యానికి వస్తున్న నగదు ఏమాత్రం సరిపోవడం లేదు. జిల్లాలో పంట విరామం ప్రకటించక ముందే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు స్పందించాల్సిన అవసరం ఎంతైనా వుంది.

***పములుల దశరథరామయ్య,***
*సిపిఐ జిల్లా కార్యదర్శి.*

# నిలచిన రిలయన్స్ థర్మల్ పనులు!

● కారణమేమిటో తెలియడం లేదు

ముత్తుకూరు మండలం కృష్ణపట్నంలో నిర్మిస్తున్న అల్ట్రామెగా థర్మల్ విద్యుత్ కేంద్రం పనులను అర్ధాంతరంగా నిలిపివేయడంతో సర్వత్రా ఆందోళన వ్యక్తమవుతోంది. కోస్తా తీరంలో ప్రతిష్ఠాత్మకంగా ప్రారంభమైన అల్ట్రామెగా థర్మల్ విద్యుత్ కేంద్రం ఏర్పాటుకు సంబంధించి భూసేకరణ, ప్రాథమిక దశ పనులు పూర్తయిన నేపథ్యంలో అనుకోని విధంగా పనులు నిలిపివేయడంతో అటు కాంట్రాక్టర్లు, ఇటు కూలీలు తీవ్ర ఆందోళన చెందుతున్నారు. పనులు ఆగిపోవడంతో ఇప్పటివరకు పనులు చేసిన సబ్ కాంట్రాక్టర్లు తమకు రావాల్సిన బిల్లుల పరిస్థితి ఏమిటా? అని ఆందోళన వ్యక్తం చేస్తుండగా, మరోవైపు నిర్వాసితులు నష్టపోతున్నారు. థర్మల్ కేంద్రం ఏర్పాటు కోసం అయ్యప్పవారి కండ్రిగ, శంభుని తోపు గ్రామాల వారిని ముత్తుకూరుకు తరలించారు. నిర్వాసితుల కాలనీలో సంపూర్ణ మౌలిక వసతులు కల్పిస్తామని రిలయన్స్ కంపెనీ భరోసా ఇచ్చింది. పలువురికి ప్రాజెక్టు పనుల్లో ఉపాధి కల్పించింది. వున్నట్లుండి కంపెనీ యాజమాన్యం విద్యుత్ కేంద్రం పనులు నిలిపివేయడంతో నిర్వాసితుల పరిస్థితి అగమ్యగోచరమైంది. కూలీలకు ఉపాధి లేకుండా పోయింది. ఈ పరిస్థితుల్లో అధికారులు జోక్యం చేసుకొని తమకు న్యాయం చేయాలని నిర్వాసితులు కోరుకొంటున్నారు.

# అక్రమ కట్టడాలు కూల్చివేత

**వెంకటగిరిలో ముందడుగు**

వెంకటగిరిలో గత కొంతకాలంగా ప్రభుత్వ స్థలాల ఆక్రమణ, అక్రమకట్టడాలు పెరిగిపోతున్నా సంబంధిత అధికారులు ఉలుకు పలుకు లేకుండా వున్నారు. జిల్లా కలెక్టర్ శ్రీధర్ ఈ ప్రాంతంలో పర్యటించి అధికారుల్లో చురుకు పుట్టించడంతో ఎట్టకేలకు నిద్ర వీడారు. ఆగష్టు మొదటి వారంలో వెంకటగిరికి వచ్చిన కలెక్టర్ వసతి గృహంలో ప్రైవేట్ పాఠశాల కట్టడాలను తొలగించాలని ఆదేశించారు. పెరియవరం వద్ద ప్రభుత్వ స్థలంలో వేసిన గుడిసెలను పరిశీలించిన ఆయన వీటన్నింటిని తొలగించాలని ఆదేశించడంతో అధికారులు చర్యలకు ఉపక్రమించారు. ఈ నిర్ణయంతో స్థానిక ప్రజల్లో హర్షం వ్యక్తం అవుతోంది. రోజురోజుకు పట్టణంలో ఆక్రమణలు పెరిగిపోతున్నా, ప్రభుత్వ స్థలాల్లో అక్రమంగా నిర్మాణం చేపడుతున్నా అధికారులు ఆ జోలికే పోలేదు. ప్రజలు ఎన్నిసార్లు ఫిర్యాదు చేసినా మునిసిపల్, రెవెన్యూ శాఖలు పట్టనట్లు వ్యవహరిస్తుండడంతో విసిగిపోయారు స్థానికులు. ఈ పరిస్థితుల్లో కలెక్టర్ ప్రత్యక్షంగా పరిశీలించి ఆక్రమణలు, అక్రమకట్టడాలపై కొరడా ఝుళిపించడంతోనైనా భవిష్యత్తులో ఆక్రమణలు నిలిచిపోతాయని విశ్వశిస్తున్నారు ప్రజలు.

## తెరచుకొన్న ముదివర్తి స్కూల్

కలెక్టర్ చొరవతో ఎట్టకేలకు ఇందుకూరుపేట మండలం ముదివర్తిపాళెం పాఠశాల తలుపులు తెరచుకొన్నాయి. గ్రామంలో గల హైస్కూలులో సబ్జెక్టు టీచర్లు ఇద్దరు మాత్రమే వున్నారు. అరకొరగా టీచర్లున్నా పిల్లలు ఎలాగోలా చదువుకుంటున్నారు. ఈ పరిస్థితుల్లో ఇద్దరు టీచర్లలో గణితం బోధించే ఉపాధ్యాయుడు మూడునెలల క్రిందట వార్డెన్‌గా బదలీపై వెళ్లాడు. అప్పటినుంచి మ్యాథ్స్ చెప్పేవారు లేకపోవడంతో విద్యార్థులు తీవ్ర ఇబ్బందులు పడ్డారు. ముఖ్యంగా ఈ

**కలెక్టర్ చొరవ కారణం**

పాఠశాలలో తెలుగు, ఇంగ్లీషు మీడియం రెండూ వుండడంతో పదవతరగతి పిల్లలు లెక్కల సబ్జెక్టులో వెనుకబడాల్సిన పరిస్థితులు ఎదురైనాయి. విద్యార్థుల పరిస్థితి చూసి ఆందోళన చెందిన పిల్లల తల్లిదండ్రులు స్కూలుకు తాళం వేసి తమ నిరసనను అధికారులకు తెలియజేశారు. విద్యార్థుల సమస్యను తెలుసుకొన్న కలెక్టర్ శ్రీధర్ మ్యాథ్స్ టీచర్‌ను వెనక్కు రప్పించి విద్యార్థులకు ఇబ్బంది కలుగకుండా చర్యలు చేపట్టడంతో హైస్కూల్ తలుపులు తెరచుకొన్నాయి.

## లైంగిక వేధింపులు!

మహిళా కార్యదర్శిపై లైంగిక వేధింపులకు పాల్పడుతున్న వ్యవహారం నాయుడుపేటలో సంచలనం రేపింది. స్థానికంగా పంచాయితీ కార్యదర్శిగా పనిచేసే ఒక మహిళ తనపై మండల విస్తరణాధికారి వెంకట రమణ వేధింపులకు గురిచేస్తున్నాడని ఉన్నతాధికారులకు ఫిర్యాదు ఇవ్వడంతో గగ్గోలు రేగింది. మండల పరిధిలోని తిమ్మాజీ కండ్రిగ, చిలమత్తూరు గ్రామాలకు కార్యదర్శిగా పని చేస్తున్న

**నాయుడుపేట మండల విస్తరణాధికారి పైత్యం**

ఆమెను ఆ అధికారి పలు రకాలుగా వేధిస్తున్నాడట. దీనికి ఆ నీచుడు మండల కార్యాలయంలో పనిచేసే మరో మహిళ ద్వారా మధ్యవర్తిత్వం నడపడం, కోరిక తీర్చకుంటే నీ అంతు చూస్తానని, అక్రమాలకు పాల్పడినట్లు అధికారులకు చెప్పి ఉద్యోగం నుంచి తీయించివేస్తానని బెదిరిస్తుండడంతో చాలా కాలం పంటి బిగువన ఈ బాధ భరించిన ఆ మహిళా కార్యదర్శి ఎట్టకేలకు ఆ అధికారిపై ఉన్నతాధికారులకు ఫిర్యాదు చేయడంతో విషయంవెలుగు చూసింది.

## సంక్షేమశాఖ డిడిపై కలెక్టర్ కన్నెర్ర

సంక్షేమశాఖ డిప్యూటి డైరెక్టర్ విశ్వమోహన్‌పై జిల్లాకలెక్టర్ శ్రీధర్ తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేసిన ఘటన కావలి సమీక్షా సమావేశంలో చోటుచేసుకొంది. స్థానిక విట్స్ కళాశాలలో ఎస్సీ, ఎస్టీ, బిసి సంక్షేమశాఖల వసతి గృహ అధికారులతో కలెక్టర్ సమీక్ష నిర్వహించారు. ఈ సందర్భంగా విశ్వమోహన్‌రెడ్డి ప్రవర్తించిన తీరు కలెక్టర్‌కు తీవ్ర ఆగ్రహం తెప్పించింది. సెక్రటరియేట్‌లో పని చేసి వచ్చామని చెప్పడం కాదు విధినిర్వహణ సక్రమంగా చేయాలి. సమీక్షకు, సమావేశానికి తేడా తెలియదా అంటూ ఉగ్రుడైనాడు. ఒక

**మారరా అంటూ సభలో నిలదీత**

దశలో సహనం కోల్పోయిన కలెక్టర్ మైక్‌ను బలంగా టేబుల్‌కేసి కొడుతూ సాయంత్రం వరకు టైమిస్తున్నాను సమీక్షకు నిర్వచనం చెప్పమంటూ కటువుగా మాట్లాడడంతో అధికారులు భయకంపితులయ్యారు. హాస్టళ్లలో విద్యార్థులకు మెను సక్రమంగా అమలు చేయాలని, విద్యార్థులపై ప్రత్యేక దృష్టి సారించాలని అధికారులను ఆదేశించారు. ఇప్పటికైనా మారండి లేకపోతే ఉపేక్షించేది లేదని తీవ్రంగా మందలించడంతో సమీక్షలో గంభీర వాతావరణం నెలకొనింది.



నెల్లూరు ట్రంకురోడ్డులోని పురుషోత్తం ఎంటర్‌ప్రైజెస్‌ను వీడియోకాన్ ఇండస్ట్రీస్ అధ్యక్షుడు ప్రదీప్ నందలాల్ దూత్ సందర్శించారు. ప్రక్కన ఎంటర్‌ప్రైజెస్ అధినేత పురుషోత్తం వున్నారు.



స్వాతంత్ర్య దినోత్సవాన్ని పురస్కరించుకొని నెల్లూరు ఇందిరాభవన్‌లో పతాకావిష్కరణ అనంతరం మాట్లాడుతున్న పిసిసి బిసి సెల్ కన్వీనర్ రఘురామ్. ప్రక్కన పిసిసి కార్యదర్శి ఉడతా వెంకట్రావ్, బాలసుధాకర్, పందిళ్లపల్లి అరుణమ్మ తదితరులు.



ఉత్తమ సేవలకు గాను స్వాతంత్ర్య దినోత్సవ పెరేడ్‌లో ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి చేతుల మీదుగా ప్రశంసాపత్రం అందుకొంటున్న సహకారశాఖలో అసిస్టెంట్ రిజిస్ట్రార్ కెవి.రమణయ్య.

## ప్రభుత్వ తీరును నిరసిస్తూ ధర్నా

సాంఘిక సంక్షేమ హాస్టళ్లను రద్దు చేసే ఆలోచనను ప్రభుత్వం విరమించుకోవాలని దళిత సంఘర్షణ సమితి డిమాండ్ చేసింది. ప్రభుత్వ నిర్ణయాన్ని నిరసిస్తూ బోగోలు తహశీల్దార్ కార్యాలయం వద్ద ధర్నా చేపట్టారు. సమితి జిల్లా అధ్యక్షుడు మల్లి మాట్లాడుతూ ప్రభుత్వం సాంఘిక సంక్షేమ హాస్టళ్లను ఇంటిగ్రేటెడ్ హాస్టళ్ల పేరుతో రద్దు పరచేందుకు ప్రయత్నిస్తోందని ఆరోపించారు. పిల్లల సంఖ్య తక్కువగా వుందనే సాకుతో మండల స్థాయిలో వున్న హాస్టళ్లను రద్దు చేసి నియోజకవర్గ స్థాయిలో కలిపే ప్రయత్నం చేస్తున్నారన్నారు. దీనివల్ల పేద దళిత, గిరిజన విద్యార్థులు, వెనుకబడిన తరగతుల వారు తీవ్రంగా నష్టపోతారన్నారు. తక్షణం ఈ ప్రయత్నాన్ని విరమించుకోవాలని, జిల్లాలో అధ్వాన్నంగా వున్న హాస్టళ్లకు మరమ్మత్తులు చేపట్టాలని, శిథిలావస్థకు చేరుకొన్న వాటిస్థానంలో తిరిగి నూతన నిర్మాణాలు చేయాలని డిమాండ్ చేశారు. అనంతరం ఎమ్మార్వోకు వినతిపత్రం అందజేశారు.

## జిల్లాలో మోడల్ స్కూళ్లు

రాష్ట్రవ్యాప్తంగా త్వరలో 350 మోడల్ స్కూళ్లను ఏర్పాటు చేస్తున్నట్లు ఎడ్యుకేషనల్ డెవలప్‌మెంట్ వెల్ఫేర్ అధికారి నర్సింహమూర్తి తెలిపారు. జిల్లాలో వివిధ ప్రాంతాలను పరిశీలించిన ఆయన మాట్లాడుతూ మోడల్ స్కూళ్లలో ఒకటవ తరగతి నుంచి ఇంటర్మీడియట్ వరకు తరగతులు నిర్వహిస్తారన్నారు. జిల్లాలో పది మోడల్ స్కూళ్లను ఏర్పాటు చేయడం జరుగుతుందన్నారు. ఒక్కో స్కూలును 3.2 కోట్ల రూపాయలతో ఏర్పాటు చేస్తున్నట్లు తెలిపారు. ఈ నిధుల్లో కేంద్రప్రభుత్వం 75శాతం, రాష్ట్ర ప్రభుత్వం 25 శాతం భరిస్తుందన్నారు. ఈ పాఠశాలల భవనాల నిర్మాణాల కోసం సెప్టెంబర్ నెలలో టెండర్లు పిలవనున్నట్లు చెప్పారు.

# ఆత్మకూరులో గబ్బు గబ్బు!

ఆత్మకూరులో పారిశుధ్యం అధ్వాన్నంగా వుంది. పాలకులు, అధికారులు పారిశుధ్యాన్ని మెరుగు పరచేందుకు చర్యలు తీసుకోకపోవడంతో నానాటికి దిగజారిపోతోంది. మరోవైపు అధికారులు పారిశుధ్య వారోత్సవాలు నిర్వహించాలని జిల్లా కలెక్టర్ పిలుపు నివ్వడంతో తూతూ మంత్రంగా వీటిని నిర్వహిస్తున్నారు తప్ప ప్రణాళిక బద్ధంగా వ్యవహరించకపోవడంతో పట్టణ ప్రజలు తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. రోడ్లపై ఎక్కడ చూసినా మురుగునీరు పొంగి ప్రవహిస్తుంది. చెత్త కుప్పలు, పందులు స్వైరవిహారంతో పరమ ముదనష్టంగా తయారైంది పరిస్థితి. ఈ

## క్షీణించిన పారిశుధ్యం

పరిస్థితులలో స్థానిక అధికారులు పారిశుధ్య వారోత్సవాలను నిర్వహించేందుకు పాఠశాల విద్యార్థులను చేరదీసి వారితో ర్యాలీ నిర్వహించారు. ర్యాలీలో విద్యార్థులు పరిసరాలు శుభ్రంగా వుంచుకోవాలంటూ నినాదాలు చేస్తూ మురుగునీటిని, చెత్తకుప్పలను, పందులను దాటుకొంటూ ముందుకెళ్లడం చూసి స్థానికులు ఇవేం పారిశుధ్య వారోత్సవాలంటూ చర్చించుకోవడం జరిగింది. సాక్షాత్తు ఆత్మకూరు గ్రామ పంచాయితీ ఎదురుగా, మండల పరిషత్ కార్యాలయానికి వెళ్లే రోడ్డుపై మురుగునీరు పొంగి పొర్లుతున్నా సంబంధితశాఖల అధికారులకు చీమకుట్టినట్లైనా లేకపోవడం సిగ్గుచేటు.

# కావలి డాక్టర్ల నిలువు దోపిడీ!

## అనవసరంగా పరీక్షలు, ఆపరేషన్లు!

కావలి పట్టణంలో ప్రైవేట్ డాక్టర్లు రోగులను నిలువు దోపిడీ చేస్తున్నారు. నిస్వార్థంగా ప్రజా సేవ చేసే వైద్యులు పట్టణంలో వేళ్ల మీద లెక్కించ గలిగే సంఖ్యలో వుండగా, వైద్యం పేరుతో రోగుల వద్ద నుంచి వేలాది రూపాయలు వసూలు చేసే వారే ఎక్కువయ్యారు. చిన్నాచితకా జబ్బులకోసం వీరి వద్దకు వెళితే చేంతాడంత మందుల చీటీ, వివిధ రకాల పరీక్షల పేరుతో అందినంత లాగేస్తున్నారు. ఇక మహిళా వైద్యులైతే ప్రసవం కోసం వచ్చే వారిని పిండేస్తున్నారు. నార్మల్ డెలివరీ అయ్యేవారికి సైతం కాన్పు కష్టతరం అవుతుందంటూ అబద్ధాలు చెప్పి ఆపరేషన్ చేసి వేల రూపాయలను హాస్పిటల్ ఫీజుల రూపంలో గుంజేస్తున్నారు. ప్రపంచ ఆరోగ్య సంస్థ సూచించిన నిబంధనలను పాటించకుండా సంపాదనే ధ్యేయంగా పెట్టుకొని రోగులను నిలువునా దోచేస్తుండడంతో పట్టణంలోని పలు ఆస్పత్రులకు వెళ్లాలంటేనే హడలిపోతున్నారు రోగులు. మరికొందరు గైనకాలజిస్టులు వివిధ సమస్యలతో వచ్చే మహిళలను బెదరగొట్టి గర్భసంచి తొలగించాల్సిందేనంటూ చెప్పి అవసరం లేకపోయినా ఆపరేషన్ చేసి గర్భసంచి తొలగించి వేస్తున్నారు. ఇది మంచి రాబడిగా మారడంతో వైద్యులు సులభంగా చేసేస్తున్నా మహిళలు మాత్రం భవిష్యత్తులో పలు ఇబ్బందులు ఎదుర్కోవాల్సి వస్తోందని వైద్యనిపుణులు హెచ్చరిస్తున్నారు. వైద్య శాఖాధికారులు ఇలాంటి వారిపై దృష్టి సారించి వైద్యవృత్తికి కళంకం తెచ్చేలా, డబ్బుపిచ్చిపట్టిన డాక్టర్లను చక్కదిద్దాల్సి వుంది.

# నాయుడుపేట హాస్టళ్లు అధ్వాన్నం!

నాయుడుపేట మండలంలోని ప్రభుత్వ సాంఘిక సంక్షేమ వసతి గృహాల పరిస్థితి అధ్వాన్నంగా వుంది. హాస్టళ్లలో చదివే విద్యార్థుల బాగోగులు పట్టించుకోవాల్సిన అధికారులు వారి పొట్టకొట్టి జేబులు నింపుకొనేందుకు చూపుతున్న శ్రద్ధ విద్యార్థుల పట్ల చూపకపోవడంతో అవి సమస్యల నిలయాలుగా మారుతున్నాయి. కనీస సౌకర్యాలకు నోచుకోకపోవడంతో హాస్టళ్లు నరక కూపాలుగా వుంటున్నాయి. పేదలు తమ బిడ్డలను చదివించే స్థోమత లేక హాస్టళ్లలో వుంచి చదువు చెప్పిస్తున్నారు. అక్కడ వీరిని చక్కగా చూసుకొని ప్రభుత్వం అందించే ఆహారాన్ని పెట్టాల్సిన హాస్టల్ అధికారుల నిర్లక్ష్య వైఖరి విద్యార్థులకు కన్నీళ్లు తెప్పిస్తుంది. నాయుడుపేట పట్టణంలో గల ఎస్సీ వసతి గృహానికి సొంత భవనం లేదు. అద్దె ఇంట్లో దీనిని నిర్వహించాల్సి వస్తుండడం, సౌకర్యాలకు నోచుకోకపోవడంతో విద్యార్థులు పలు అవస్థలు పడుతున్నారు. త్రాగడానికి మంచినీరు దొరకవు. స్నానపు గదులు, నీటి సౌకర్యం లేకపోవడంతో రాత్రివేళల్లో హాస్టల్‌ను విడిచిపెట్టి సమీపంలో వున్న జిల్లాపరిషత్ పాఠశాలలో తలదాచుకోవాల్సిన పరిస్థితి నెలకొనింది. వానొస్తే హాస్టల్ దుస్థితి చెప్పనే పన్లేదు. జిల్లా కలెక్టర్ స్పందించి అక్కడి విద్యార్థులు ఎదుర్కొంటున్న సమస్యలను పరిష్కరించాలని తల్లిదండ్రులు కోరుకొంటున్నారు.

**నానాపాట్లు పడుతున్న విద్యార్థులు**

# అక్రమబాటన రెవిన్యూ ఉద్యోగులు

## ☛ బోగోలులో పరిస్థితిది

బోగోలు మండలంలో రెవెన్యూ అధికారుల అవినీతికి అంతే లేకుండా పోతోంది. ఏ పని కావాలన్నా, సంతకం పెట్టాలన్నా పైసలు చెల్లించాల్సిందే. అడిగినంత ఇవ్వకపోతే పలురకాల కారణాలతో రోజుల తరబడి తిప్పుకొంటుంటారు. ముఖ్యంగా మండలంలో బోగోలు పంచాయితీ పరిధిలో వున్న ఇద్దరు విఆర్ఓలు లంచాలు దిగమింగడంలో ఘనులు. రైతులకు పాస్ పుస్తకాలు ఇవ్వాలన్నా, అడంగల్‌లో హద్దులు వ్రాయాలన్నా నెలరోజులు తిప్పుకొని అడిగినంత ఇస్తేనే పని చేసిపెడతారని లేదంటే చెప్పులరిగేలా తిరగాల్సి వస్తోందని పంచాయితీ ప్రజలు వాపోతున్నారు. గతంలోనూ తెల్లకార్డు వుండే వారికి ఆరోగ్యశ్రీ కార్డు వర్తిస్తుండడంతో రేషన్‌కార్డులు మంజూరు చేసేందుకు ఒకొక్కరి వద్ద నుంచి రెండువేల రూపాయలు తీసుకొని ఇచ్చారట. పేదలను సైతం వదలి పెట్టకుండా గద్దల్లా పీక్కుతిన్నారంటే వీరెంతగా లంచాల సొమ్ము దిగమింగేందుకు అలవాటుపడ్డారో అర్థం అవుతుంది. ఈ ఇద్దరు విఆర్ఓలను బదలీ చేసేందుకు అధికారులు ప్రయత్నించినా కొందరు నేతల సహకారంతో బదలీ నిలుపుకొని ఆ పంచాయితీలోనే వుండిపోతున్నారంటే అక్కడి రాబడి ఎంత అధికంగా వుంటుందో తెలుస్తోంది. మండలంలోని మిగతా ప్రాంతాలలోనూ ఇదే పరిస్థితి. చేయితడపందే రెవెన్యూలో పని కావడం లేని పరిస్థితి నెలకొనిందని  మండల ప్రజలు వాపోతున్నారు. ఇప్పటికైనా జిల్లాఅధికారులు బోగోలు రెవెన్యూ సిబ్బందిని గాడిలో పెట్టాల్సి వుంది.

## 'దివాకర్' ఆరాటమెందుకో!



వైఎస్‌ను, జగన్‌ను తీవ్రంగా వ్యతిరేకించే దివాకర్‌రెడ్డి కొన్నాళ్లుగా జగన్‌ను ఆకర్షించడానికి నానాతంటాలు పడుతున్నాడు. జగన్ ఇటీవల అనంతపూర్ జిల్లాలో పర్యటించినప్పుడు జనం వెల్లువలా రావడం గమనించి దివాకర్ తన వైఖరిని మార్చుకున్నాడని ఆ జిల్లా నాయకులు చెవులు కొరుక్కొంటున్నారు. ఇప్పటికైనా సమయం మించిపోలేదు. జగన్ కాంగ్రెస్‌లోకి తిరిగి రావచ్చంటూ బహిరంగ ప్రకటనలు కూడా చేస్తున్నాడు. జగన్‌పై అవినీతి ఆరోపణలు ఎన్ని వస్తున్నా ఆయన సభలకు జనం విపరీతంగా రావడంపై కేవలం దివాకరే కాదు... సీమలోని కాంగ్రెస్ నాయకులంతా పునరాలోచనలో పడుతున్నారట. మరి జనం వుంటేనే కదా ఓట్లు రాలేది!

## గవర్నర్ గారి ఫంక్షన్ ఫ్లాప్



ఆగష్టు 15న రాష్ట్ర గవర్నర్ 'ఎట్‌హోమ్' పేరుతో రాజ్‌భవన్‌లో ప్రముఖులందరికీ విందు ఏర్పాటు చేయడం ఆనవాయితీ. ఈ సారి కూడా నరసింహన్ ఆధ్వర్యంలో భారీగా విందు ఏర్పాట్లు జరిగాయి. కనీసం నాలుగైదు వందల మందిదాకా హాజరవుతారని అంచానా వేశారు. తీరా చూస్తే ఆ ఫంక్షన్‌కు వచ్చిన వారి సంఖ్య యాభైకూడా దాటలేదు. సిఎం కిరణ్, మాజీ సిఎం రోశయ్యతోపాటు ఉభయసభల స్పీకర్లు, బొత్సా, కెవిపి వంటి రాజకీయుల కేవలం పధ్నాలుగు మంది మాత్రమే వచ్చారు. మంత్రివర్గం మొత్తం గైర్హాజర్‌కాగా నగరమంత్రి దానం నాగేందర్ మాత్రం హాజరయ్యాడు. ప్రతిపక్ష నేతలెవరూ రాలేదు. ఒక్క బండారు దత్తాత్రేయ మాత్రం కనిపించాడు. గవర్నర్ ఏఐసిసి ప్రతినిధిగా వ్యవహరిస్తున్నాడంటూ నిరసనగా తెలుగుదేశం పార్టీ నాయకులు ఈ ఫంక్షన్‌కు రాలేదు. ఇక తెలంగాణకు గవర్నర్ వ్యతిరేకి అంటూ తెలంగాణ నాయకులు కూడా రాలేదు. వీళ్లంతా రానిది మేం మాత్రం ఎందుకనుకున్నారో ఏమో గానీ ఇతర పార్టీల వారు కూడా ఈ కార్యక్రమానికి దూరంగా వున్నారు. ఇక ఐఎఎస్ అధికారులు 15మంది, ఐపిఎస్‌వారు 14మంది వచ్చారు. వీరంతా రాష్ట్ర ప్రభుత్వ సేవా అవార్డులు ప్రకటించిన వారు కావడం గమనార్హం. మొత్తానికి గవర్నర్‌గారి ఫంక్షన్ ఇంత పేలవంగా, జనం లేకుండా జరగడం రాష్ట్రచరిత్రలో ఇదే మొదటిసారి అంటూ రాజధానిలో చెవులు కొరుక్కుంటున్నారు.

## కెవిపి వెల వెల



ఓడలు బండ్లవుతాయి, బండ్లు ఓడలవుతాయన్న సామెతలా వుంది ఓ కె.వి.పి రామచంద్రరావు పరిస్థితి. వై.ఎస్ హయాంలో ఓ వెలుగు వెలిగిన కెవిపి ఇప్పుడు గ్రహణం పట్టిన వాడిలా కనిపిస్తున్నాడు. ఆగష్టు 15వ తేదీన రాజ్‌భవన్‌లో గవర్నర్ ఏర్పాటు చేసిన "ఎట్‌హోమ్" కార్యక్రమానికి హాజరైన ఐఎఎస్‌లు కానీ, ఐపిఎస్‌లు కానీ, రాజకీయులు కానీ కెవిపికి ముఖం చాటేశారు. ఒకప్పుడు కెవిపి తమవైపు చూస్తే చాలు అనుకున్న వీరంతా ఇప్పుడు తప్పించుకు తిరగటం కెవిపిని బాధించింది. కనీసం సిఎంగానీ, బొత్సా కానీ, రోశయ్య కానీ తన దగ్గరకు వచ్చి పలకరిస్తారేమోనని కెవిపి చాలాసేపు ఎదురు చూశాడు. అయినా ఫలితం లేదు. కెవిపికి ఎదురుగా కూర్చొని వీరు ముగ్గురు గంటకుపైగా మాట్లాడుకున్నారు. ఆ తర్వాత లేచి ఎవరి దారిన వారు వెళ్లిపోయారు. కనీసం వెళ్లేటప్పుడు కూడా వస్తామని చెప్పలేదట. గవర్నర్ నరసింహన్ కూడా దూరం నుంచే చేయి ఊపి కెవిపి నుంచి తప్పించుకున్నాడట. ఒక్క మాదాసు గంగాధరం మాత్రం కెవిపికి హలో చెప్పాడట. ఏం చేద్దాం... పూలమ్మిన చోటనే కట్టెలమ్మడం అంటే ఇదే. కెవిపికి ఇప్పటికి అనుభవంలోకి వచ్చింది. పాపం కెవిపి!

## స్వీట్లు పంచిన రోశయ్య



మాజీ ముఖ్యమంత్రి కె.రోశయ్య స్వీట్లు పంచుతున్నాడు. ఇదేదో తన ఇంట్లో శుభకార్యం కోసం అనుకుంటే పొరబడినట్లే... హైదరాబాదు నగరంలోని అమీర్‌పేట భూముల కేటాయింపులో అవకతవకల్లేవంటూ అవినీతి నిరోధకశాఖ క్లీన్ చిట్ ఇవ్వడంతో రోశయ్య ఉబ్బితబ్బిబ్బవుతున్నాడు రోశయ్య. ముఖ్యమంత్రిగా వుండగా అమీర్‌పేట భూముల కేటాయింపులో కుంభకోణం జరిగిందంటూ ఓ వ్యక్తి ఎసిబి కోర్టుకు వెళ్లడం... కోర్టు దీనిపై విచారణకు ఆదేశించడం జరిగింది. వరుస కుంభకోణాలతో సతమతమవుతున్న రాజకీయ నాయకుల కోవలో చేరిపోయానన్న బాధ వుండేది రోశయ్యకు. ఇప్పుడు క్లీన్ చిట్ దొరకడంతో ఆయన ఊపిరిపీల్చుకున్నాడు. ఆయన ఇంటి దగ్గర స్వీట్లు పంచుతూ పండగ చేసుకుంటున్నాడు.






స్వాతంత్ర్య దినోత్సవాన్ని పురస్కరించుకొని పోలీస్ పెరేడ్ గ్రౌండ్‌లో జాతీయ పతాకాన్ని ఆవిష్కరించి వందనం చేస్తున్న ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి, జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి, ఎఎస్పీ నాగేశ్వరరావు తదితరులు.



జలదంకికి చెందిన స్వాతంత్ర్య సమరయోధుడు పోకూరు నరసింహారావును సన్మానిస్తున్న మంత్రి రామనారాయణరెడ్డి, ఎమ్మెల్యేలు బీద మస్తాన్‌రావు, శ్రీధర్‌కృష్ణారెడ్డి, ఎమ్మెల్సీ వాకాటి నారాయణరెడ్డి, కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి.



వైఎస్‌ఆర్ కాంగ్రెస్ పార్టీకి ఇరవై ఐదు లక్షల రూపాయల విరాళాన్ని వైఎస్.జగన్, వైవిసుబ్బారెడ్డిల సమక్షంలో అందజేస్తున్న నెల్లూరుకు చెందిన ప్రముఖ కాంట్రాక్టర్ పూండ్ల వెంకురెడ్డి.

# కల్మషాన్ని హరించి పుణ్యాన్ని ప్రసాదించే శ్రీకృష్ణాష్టమి!



బ్రహ్మాండాన్ని ఉద్ధరించడానికి శ్రీమహావిష్ణువు ఎత్తిన ఎనిమిదవ అవతారమే కృష్ణావతారమని హిందూ ఇతిహాసాలలో చెప్పబడింది. నారాయణుడు కృష్ణునిగా జన్మించిన రోజును పర్వదినంగా జరుపుకొంటారు. ఈ నెల 21వ తేది ప్రపంచవ్యాప్తంగా ఆనందోత్సాహాలతో జరుపుకొనే పండుగ కృష్ణాష్టమి. దేవకి, వసుదేవులకు అష్టమ సంతానంగా శ్రావణ మాసం, కృష్ణపక్షంలో అష్టమ తిథి నాడు కంసుడి చెరసాలలో జన్మించాడు. చంద్రమాసం ప్రకారం రోహిణి నక్షత్రంలో కృష్ణుడు పుట్టినరోజును కృష్ణాష్టమిగా జరుపుకోవడం ఆనవాయితి. దీనినే జన్మాష్టమి అని, గోకులాష్టమి అని, రోహిణి అని పలు పేర్లతో పిలుస్తారు.

సాక్షాత్తు మహావిష్ణువు అవతారమైన కృష్ణావతారం దుష్టశిక్షణకు, శిష్ట రక్షణకు ఎత్తిన అవతారంగా భావిస్తారు. లోకంలో పాపాలు అధికమైన సమయంలో ద్వాపర యుగంలో కృష్ణుడు జన్మించి ప్రపంచానికి ధర్మాన్ని తెలియజెప్పాడు. ధర్మపరంగా రాజనీతి తెలిసినవాడు, ధర్మ రక్షనే తన కర్తవ్యంగా భావించి అందుకోసం ఎన్నో నిందలు పడినా భరించాడు. తన ప్రవర్తన అర్థం కాని అర్జునుడికి రణరంగంలో గీతను బోధించాడు. ఆనాడు కృష్ణపరమాత్మ ఉపదేశించిన గీత భగవద్గీతగా లోక ప్రసిద్ధి చెందింది. పరంధాముని గీతోపదేశంతో అర్జునుడు తన అనుమానాలను తొలగించుకొని యుద్ధంలో విజయం సాధించాడు. అలాంటి శ్రీకృష్ణుడు లోకంలో ధర్మం నశించి అధర్మం వృద్ధి చెందినప్పుడల్లా అవతరిస్తానని గీతలో చెప్పినాడు. ఆయన చేసే ప్రతి పనిలోనూ గీత యొక్క అంతరార్థం నిలిచి వుందని మహాత్ములు విశ్వసిస్తారు. దీన్నే కృష్ణతత్వంగా కూడా అభివర్ణిస్తారు. అందుకే శ్రీకృష్ణుడు జగద్గురువు అయ్యాడు. అలాంటి శ్రీకృష్ణుని జన్మదినాన్ని ఎంతో మహిమాన్వితమైనదిగా భావించి భక్తిశ్రద్ధలతో పూజిస్తారు. జన్మాష్టమి నాడు పొద్దుటే సుచిగా స్నానం చేసి ఇంటి ముందు శుభ్రపరచి ముగ్గులు పెడతారు. సాక్షాత్తు బాలకృష్ణుడే ఇంటికి నడచివస్తున్నట్లుగా భావించి పాదముద్రలు వేస్తారు. పసుపు బట్టలు ధరించి పూజా మందిరంలో రాధకృష్ణుల ఫోటోను, బొమ్మను వుంచి పూజిస్తారు. సన్నజాజులతో అలంకరించి పానకం, వడపప్పు నైవేద్యంగా పెడతారు. గ్రామాల్లో పర్వదినంగా భావించి ఉట్టికొడతారు. ఆరోజున పగలంతా ఉపవాసం వుండి సాయంత్రం పండ్లు, బెల్లం, పెరుగు, మీగడ స్వామికి నైవేద్యంగా సమర్పిస్తారు. ఊయలలో శ్రీకృష్ణుని విగ్రహాన్ని వుంచి ఊపుతూ గానాలాపన చేస్తారు. జన్మాష్టమి నాడు కృష్ణుని పూజించినట్లయితే కురుక్షేత్రంలో సువర్ణ దానం చేసిన ఫలం దక్కుతుందని బ్రహ్మాండ పురాణంలో చెప్పబడింది. కలియుగంలో కల్మషాన్ని హరించి పుణ్యాన్ని ప్రసాదించే పండుగ గోకులాష్టమి.

J

## ట్రంకురోడ్డు



### బంగ్లా తలుపులు తెరిచారు!

గతంలో నెల్లూరు కలెక్టర్లుగా పనిచేసిన వారందరూ బంగ్లాలో ఏ సమయంలోనైనా సామాన్యులు తమను ఏదైనా పనిబడి కలవను వచ్చినప్పుడు ఒకటి రెండు నిమిషాలు మాట్లాడేవారు. కలెక్టరేట్ లేదా క్యాంపులకు బయలుదేరే ముందు బంగ్లాలో కొంత సమయం అర్జీదారులతో ముచ్చటించేవారు. పాత కలెక్టర్ రామ్‌గోపాల్‌గారికి ఆలస్యంగా లేచే అలవాటు వుండడం వల్ల కలెక్టర్ బంగ్లాలో ఉదయం పూట ఎవర్నీ కలవను ఇష్టపడేవారు కాదు. సాయంత్రాల పూట కూడా బంగ్లాలోకి ఎవరూ రాకుండా సెక్యూరిటీ ఏర్పాటు చేసి తలుపులు వేసేవారు. శ్రీధర్‌రెడ్డి కలెక్టర్‌గా బాధ్యతలు స్వీకరించాక పాత పద్ధతులకు స్వస్తి పలికారు. ఉదయం పూట బంగ్లాలో సామాన్యుల గోడు వింటుండడంతో ప్రతి నిత్యం ఆయన్ను కలవను దూరప్రాంతాల నుంచి కూడా అర్జీదారులొస్తున్నారు. తాను బంగ్లాలో వున్న సమయంలో కష్టాలు చెప్పుకోను వచ్చిన వారిని ఆయన ఆదరించి మాట్లాడుతున్నారు. సాయంత్రాలపూట బంగ్లా తలుపులు మూసే సంస్కృతికి సైతం ఆయన స్వస్తి పలకడం ట్రంకురోడ్డులో చర్చనీయాంశమయ్యింది.

### జనం కళ్లలో మట్టి!



నగరానికి సొగసులద్ది సుందర సింహపురిని చేస్తానని రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి అరిగిపోయిన రికార్డు వేయడం మినహా కార్యాచరణ కానరాదు. నాగరికతకు చిహ్నాలైన నగర రోడ్లు గుంటామిట్టలతో వున్నా జనం సర్దుకుపోతూనే వున్నారు. కాని ట్రంకురోడ్డు, పొదలకూరురోడ్డు, మినీబైపాసు రోడ్డులపై పేరుకపోయిన మట్టిని సిఎం లాంటి ప్రముఖులు వచ్చినప్పుడే తీయిస్తున్నారు. పెరిగిన వాహనాలు, గాలికి అద్దాలు లేకుండా ద్విచక్ర వాహనాలు నడిపేవారు, పాదచారుల కళ్లలో మట్టిపడి కరకరమండుతుండడంతో అల్లాడిపోతున్నారు. కార్పొరేషన్ ప్రత్యేకాధికారి లక్ష్మీకాంతం రోడ్లపై మట్టిని వారానికోసారైన తొలగించేలా కార్యాచరణ రూపొందిస్తే జనం సంతోషిస్తారు.

### ట్రాఫిక్ ఆపాలా?



ఎస్పీ బి.వి.రమణకుమార్ నిగర్వి. దైవభక్తి పరాయణుడు. సామాన్యులకు అందుబాటులో వుండను ప్రయత్నిస్తుంటారు. ఆయనకు తెలిసి జరుగుతుందో, తెలియక జరుగుతుందో తెలియదు కానీ ఎస్పీ పొదలకూరు రోడ్డులోని తన బంగ్లా నుంచి వాహనంలో బయటకు వచ్చే సమయంలో రోడ్లో ఇరుప్రక్కల ట్రాఫిక్‌ను ఆపేస్తున్నారు. దీనివల్ల వాహనచోదకులు ఎస్పీని నిందిస్తున్నారు. నక్సలైట్ల హిట్‌లిస్ట్‌లో వుండిన శ్రీనివాసరెడ్డి వంటి అధికారి బంగ్లాలో నుంచి బయటకు వచ్చే సమయంలో కూడా రోడ్డులో ట్రాఫిక్ ఆపేవారు కాదు. కాని ఇప్పుడు ఆపి ఎస్పీని సెక్యూరిటీ సిబ్బంది జనం చేత తిట్టించచడంపై ట్రంకురోడ్డులో వాడివేడి చర్చజరుగుతుంది.

### మూరపూలు ముప్పై రూపాయలు!



మార్కెట్‌లో మామూలు రోజుల్లో మల్లెపూలు మూడు మూరలు పది రూపాయల ధర పలుకుతాయి. సెంటుజాజులు పదిరూపాయలకు రెండు మూరలొస్తున్నాయి. కనకాంబరాలకైతే మూరకు పదిరూపాయలు పెట్టాలి. కాని ఈవారంలో జరిగిన వరలక్ష్మీ వ్రతాన్ని పురస్కరించుకొని గురు, శుక్ర వారాల్లో పూలరేట్లు ఆకాశాన్ని అంటాయి. మల్లెపూలు మూర 15రూపాయలు, సెంటుజాజులు 20రూపాయలు, కనకాంబరాలు ముప్పై నుంచి నలభై రూపాయలు అమ్మారు. అతివలకు పూలతో వున్న అనుబంధాన్ని రేట్లు అడ్డుకట్ట వేయలేవుగా? ఖర్చుకు వెనుకాడకుండా కొని పూజతోపాటు జడల్లో తురిమి లక్ష్మీదేవి అనుగ్రహానికి పరితపించారు.

### మేకపాటిలో మార్పు



పరిస్థితుల ప్రభావం వల్ల మనుషుల్లో మార్పు వస్తుంది. దీనికి ఉదాహరణగా నెల్లూరు ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డిని పేర్కొనవచ్చు. ఐదారు నెలల క్రితం వరకు ఆయన ఎక్కడ వుండేవారో, ఏమి మాట్లాడేవాడో తెలిసేది కాదు. వైఎస్ జగన్‌కు మద్దతుదారునిగా మారిన తర్వాత జిల్లాలో విస్తృతంగా పర్యటిస్తున్నారు. జగన్‌తోపాటు తమ కుటుంబాన్ని విమర్శించే ఆనం వివేకానందరెడ్డికి ధీటుగా సమాధానం చెబుతున్నారు. రాష్ట్రవ్యాప్తంగా జగన్‌తో కలసి పర్యటిస్తున్నారు. రాజకీయ చర్చల్లో పాల్గొనను పగలు రాత్రి తేడా లేకుండా కారులో ఒంటరిగా సైతం వెళ్లడం చూసేవారు మాత్రం ఎమ్పీలో ఎంతమార్పని నిట్టూరుస్తున్నారు.




స్త్రీ సౌఖ్యం, ధనలాభం, ఇతరుల సహకారం లభిస్తుంది. ఆత్మ విశ్వాసం కొరవడుతుంది. అనుకొన్న పనులు అనుకొన్న రీతిలో సాగుతాయి. సంతానమూలంగా సుఖశాంతులు లభిస్తాయి. వారి విద్యారంగం ప్రోత్సాహకరంగా వుంటుంది. ధన విషయంలో లోటుండదు. భవిష్యత్తుకు మంచి పథకాలు వేస్తారు. పురోభివృద్ధి అన్ని రంగాలలో వుంటుంది. రాజకీయులకు అత్యంతం అనుకూలమైన కాలం.




తొందరపాటు నిర్ణయాల వల్ల ఇబ్బందులు తప్పవు. గృహనిర్మాణ కార్యక్రమాలు చేపడతారు. ఆత్మస్థైర్యాన్ని పెంపొందించుకోండి. మిత్రులు సాయమందిస్తారు. పద్ధతి ప్రకారం పనులు నిర్వహిస్తారు. ప్రయాణాలు సుముఖంగా సాగుతాయి. ఆర్థిక లావాదేవీలు మీకనుకూలంగా వుంటాయి. ఇన్నినాళ్ళు ఆటంకాలతో అడ్డుపడ్డ పనులు ఊపందుకొంటాయి. వ్యాపారులకు ప్రోత్సాహకరమైన వారం.




స్త్రీ సుఖం, కీర్తి, సమాజంలో పేరు బాగుంటుంది. సకాలంలో తగు నిర్ణయాలు తీసుకొంటారు. నూతన విద్యా వైజ్ఞానిక ప్రయోగాలు, వ్యాపారాలు విజయవంతమవుతాయి. తరచూ అనారోగ్యానికి గురౌతారు. అనుకొన్న పనులన్నీ అనుకొన్న రీతిలో ప్రణాళికా బద్ధంగా జరుపుకొంటూపోతారు. ఉద్యోగవృద్ధి, వేతనవృద్ధి వుంటుంది. ఇంత వరకు ఉంటూవచ్చిన ఇబ్బందులు తొలగుతాయి.




నూతన కార్యక్రమాలకు ఉపక్రమిస్తారు. ప్రతి పనీ సమస్యాత్మకంగా వుంటుంది. ఫలితంగా కంగారు పడుతుంటారు. కుటుంబంలో అశాంతి, అసౌఖ్యం వున్నా ఆ పరిస్థితి తాత్కాలికమే. వృత్తి వ్యాపారాలు బలోపేతమవుతాయి. దైవానుగ్రహం, పెద్దల ఆశీర్వాదం వల్ల చివరికి ఫలితం మీకనుకూలంగా వుంటుంది. దైవకార్యాల నిమిత్తం డబ్బు ఖర్చు చేస్తారు. అకారణ విరోధాలు తలెత్తే ప్రమాదం వుంది.




నమ్మిన వారి నుంచి మీరు ఆశించిన జవాబు రాదు. స్త్రీలు తమ ఆరోగ్యం పట్ల జాగ్రత్త వహించాలి. సోదరుల మూలంగా ఖర్చు. వ్యాపారులకు మొదట అంతంతమాత్రంగానే వున్నా తర్వాత లాభాలు వస్తాయి. వారం మొదట్లో ధనలాభం, కొత్తవారితో పరిచయాలు. సహనం, సంయమనం అవసరం. కుటుంబ సభ్యులతో చిన్నపాటి మాట పట్టింపులు, అభిప్రాయభేదాలు కలుగుతాయి.




అకాల భోజనం. ఫలితంగా అసంతృప్తి. పరిస్థితుల ప్రతికూలత. కుటుంబ వ్యవహారాల్లో సంయమనం పాటిస్తే మంచి ఫలితం వుంటుంది. తొందరపాటు వల్ల అనర్ధమే తప్ప ప్రయోజనం వుండదని గ్రహించండి. బద్ధకాన్ని వదలి శ్రమ పడగలిగితే అందుకు తగిన ప్రతిఫలం తప్పక పొందుతారు. ఉద్యోగులకు విధుల పట్ల అనాసక్తత. తలకు సంబంధించిన అనారోగ్యం వచ్చే సూచనలున్నాయి.

# వారఫలాలు

*తేది 20-8-2011 నుండి 26-8-2011 వరకు సింహాలో శుక్రుడు; కర్కాటకంలో బుధుడు; మేషంలో గురువు; మిథునంలో కుజుడు; వృషభంలో కేతువు; వృశ్చికంలో రాహువు; కన్యలో శని; మేష, వృషభ, మిథున, కర్కాటకాల్లో చంద్రుడు సంచరిస్తారు.*

## పంచాంగం

21 తేది కృష్ణాష్టమి.

22 తేదీ కృష్ణ జయంతి.

### శుభ ముహూర్తాలు

24, 26 తేదీలలో తులా లగ్నాన ఉ.10.30 నుండి 12.00గంటల వరకు. మకర లగ్నాన సా.04.00 నుండి 06.00 గంటల వరకు సాధారణ శుభ ముహూర్తాలున్నాయి.

**జూలై తిథులు**

**శ్రావణ బహుళ**

| | | | |
|---|---|---|---|
| 20 | శని | షష్ఠి | ఉ 08.54 గం.ల.వ |
| 21 | ఆది | సప్తమి | ఉ 10.39 గం.ల.వ |
| 22 | సోమ | అష్టమి | ఉ 12.07 గం.ల.వ |
| 23 | మంగళ | నవమి | ప 01.08 గం.ల.వ |
| 24 | బుధ | దశమి | ప 01.37 గం.ల.వ |
| 25 | గురు | ఏకాదశి | ప 01.300గం.ల.వ |
| 26 | శుక్ర | ద్వాదశి | ప 01.12 గం.ల.వ |

**పి.ఎం.గోపాలాచారి**
16/1020, పొగతోట, నెల్లూరు – 1.
E-mail:maripmgg@yahoo.com




బంధుమిత్రులకు సంబంధించిన శుభకార్యాల్లో పాల్గొంటారు. నూతన కార్యక్రమాలకు ఉపక్రమిస్తారు. ప్రతి పనిని ప్రతిష్ఠాత్మకంగా పూర్తిచేస్తారు. కుటుంబంలో అశాంతి, అసౌఖ్యం వున్నా ఆ పరిస్థితి తాత్కాలికమే. వృత్తి వ్యాపారాలు బలోపేత మౌతాయి. సంతానం విషయంలో జాగ్రత్త అవసరం. దైవకార్యాల నిమిత్తం డబ్బు ఖర్చు చేస్తారు. ప్రణాళికాబద్ధమైన నడవడితో ముందుకు సాగుతారు.




ఋణ భయం. ఇతరుల వల్ల మోసపోతారు. సరైన సమయానికి తగిన ప్రణాళికలు వేయలేక సతమతమౌతారు. జీవితభాగస్వామి బంధువులతో గొడవలుండవచ్చు. నోరు పారవేసుకోకుండడం మంచిది. ప్రతి పని నిలిచి నిదానంగా చేయడం మంచిది. వృత్తిలో మార్పు చేర్పులుండవచ్చు. వ్యాపారులకు కొంతవరకు మేలు. భాగస్వాములతో జాగ్రత్త. దైనందిన కార్యక్రమాలలో ఆటంకాలుండవచ్చు.




వ్యాపార విషయాల కారణంగా దూర ప్రయాణాలపై ఆసక్తి కనబరుస్తారు. నూతన ఆదాయమార్గాలు అన్వేషిస్తారు. సాధారణంగా గడచిపోతుంది. కళత్రంతో గొడవలు వుంటాయి. ఆర్థిక విషయాలు చక్కగా ఉన్నాయి. శ్వేతప్రదరం బాధించవచ్చు. గృహాలంకరణ విషయాలలో ఆసక్తి చూపుతారు. విద్యార్థులకు ప్రయోజనవంతమైన కాలం. అన్ని రంగాలలో ముందంజ వేస్తారు.




కళత్ర సౌఖ్యం, మానసికానందం కలుగుతాయి. సోదర వర్గ బలం మీకు బాగా కలసివస్తుంది. పరోపకారతత్వంతో మెలుగుతారు. కుటుంబంలోని సమస్యలను పరిష్కరించుకొంటారు. తరచూ అనారోగ్యానికి, అసౌఖ్యానికి గురౌతుంటారు. మెలకువగా వ్యవహరించండి. కొత్తవారితో పరిచయం కలుగుతుంది. ప్రయాణాలు అనుకూలిస్తాయి. రాజకీయ నాయకులు జాగ్రత్త వహించండి.




శత్రువుల విషయంలో జాగ్రత్త. ఇంటికి సంబంధించిన విషయాలను ఇతరులతో పంచుకోకపోవడమే మంచిది. తొందరపాటు వల్ల అనర్ధమే తప్ప ప్రయోజనం వుండదని గ్రహించండి. బద్ధకాన్ని వదలి శ్రమ పడగలిగితే అందుకు తగిన ప్రతి ఫలం తప్పక పొందుతారు. నిస్సత్తువ, మనోవ్యాకులత, అకాల ప్రయాణాలు. ముఖ్యులైన వ్యక్తుల్ని కలుసుకొంటారు. తద్వారా మీ పనులు చక్కదిద్దుకొంటారు.




ఉదర బాధ, అనుకూలం లేని ఆహారం తప్పవు. స్త్రీ సౌఖ్యం, అనుకూల ప్రయాణాలు, బంధుమిత్రుల కలయికతో ఉల్లాసంగా వుంటారు. క్రయవిక్రయాలు మీకనుకూలంగా జరుగుతాయి. కళాకారులకు, ప్రముఖులకు శుభవార్తలందుతాయి. గతంలో చేసిన తప్పిదాలను, విశ్లేషించుకొనే పనిలోపడతారు. చక్కని వ్యవహార జ్ఞానంతో వివిధ రంగాల్లోని వ్యక్తులను ఆకర్షిస్తారు. విద్యార్థులకు మంచి కాలం.

# ఈశాన్యం, వాయువ్య దోషాలతో అనారోగ్యం!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*పిన్నేని ఉషారాణి — చెన్నై*

** ఇంటిల్లపాదీ అనారోగ్యాలు. శుభకార్యాల ఆలస్యాలు, ఆకస్మిక సమస్యలు వున్నప్పుడు ఏమి చేయాలి?*

ఈశాన్యం, వాయువ్య దోషాలుంటే తొలుత వాటిని పరిహరించాలి. తర్వాత గృహం దేవుడి గదిలో వాస్తు యంత్ర ప్రతిష్ట చేసుకొని, మండలం పూజావిధానాన్ని నిర్వర్తించాలి.

*డి.స్వామిదాసు — నెల్లూరు*

** నిప్పో ఫ్యాక్టరీ ఏరియాలో నైరుతిని ఒకింటికి ఎత్తుచేశారు. తర్వాత మరింత ఎత్తు చేశారు. అలా చేయవచ్చా?*

నైరుతి, వాయువ్యం, ఆగ్నేయం కొద్దిపాటి ఎత్తుల తేడాలతో నిర్మాణాలు చేయాలి. మీరు చెప్పింది నిజమైతే నైరుతి తర్వాత ఎత్తు చేయడం చాలా తప్పు.

*కె.సుధాకర్‌సుకుమార్ — కడప*

** 'మూఢం' అంటే ఏమిటి? వివరించండి?*

శుభగ్రహమైన గురు, శుక్రులు రవితో కలిసి వున్న కాలాన్ని 'మౌఢ్యమి' అని మామూలు పరిభాషలో మూఢం అని అంటారు.

*జి.ప్రఫుల్లలక్ష్మి — నెల్లూరు*

** మాది తూర్పు ఇల్లు. పశ్చిమంలో ఇల్లు. మధ్యలో రోడ్డుంది.*

నిర్మాణంలో వున్న గృహాల్లో ఎదురింటి సింహద్వారానికి, మీ సింహద్వారం ఎదురుగా రాకుండా చూసుకోండి. 'దృష్టిదోష ఘాతం' జరుగుతుంది.

*డి.శ్రీకాంత్ — పాపానాయుడుపేట*

** నాది మూల నక్షత్రం, దేవగణం. గుర్రమని పుస్తకాల్లో చూశాను. సరిపోతుందా?*

తప్పు. మూల నక్షత్రానికి రాక్షసగణం. కుక్క వస్తుంది.

*పి.అన్నపూర్ణానాయుడు — బెంగుళూరు*

** కోడలిది పుష్యమి నక్షత్రం, అబ్బాయిది చిత్త నక్షత్రం. ఆమె వచ్చిన వేళావిశేషం మా పరిస్థితేం బాగోలేదు.*

గణరీత్యా కుమారుడిది చిత్త, అంటే రాక్షస గణం, పులి అవుతుంది. ఆమెది పుష్యమి అంటే దేవగణం, మేక అవుతుంది. చిత్తకు వేధో నక్షత్రం ధనిష్ఠ, మృగశిరలు. ఏవిధంగా చూసినా ఆవిడే భాగ్యవతి. అభాండాలు వేసి పాపం మూటగట్టుకోకండి.

*ఆర్.మేరీశ్యాంప్రసాద్ — కావలి*

** కరివేపాకు, బాదం కష్టాలు, బాధలు అంటున్నారు నిజమేనా?*

ఇంట్లో కరివేపాకు చెట్టు కష్టాలు, బాదం చెట్టు బాధల్ని కలిగిస్తుందనడం అసందర్భం. అర్థం లేని మాటలు. వృక్షవాస్తు విభాగంలో ఎవరెవరు ఏయే మొక్కలు, చెట్లు పెంచాలో క్షుణ్ణంగా వివరించబడి వుంది.

*షేక్ లతీఫ్ దఫేదార్ — హైదరాబాద్*

** రాశుల్ని బట్టి స్థలాలు కొనుగోలు చేస్తే బాగా కలసి వస్తుందా?*

శాస్త్రం పాటింపు, ఎప్పుడూ శుభదాయకమే. మీ పుట్టిన తేదీని బట్టి మీది కర్కాటకరాశి, అధిపతి చంద్రుడు. మీరు ఉత్తర, పశ్చిమ స్థలాలు కొనుగోలు చేస్తే అభివృద్ధి చెందుతారు.

*ఇ.జ్యోత్స్నారెడ్డి — సికింద్రాబాద్*

** బహుళ అంతస్థుల భవనాల్లో లిఫ్టులు కూడా గుంతల కింద లెక్కేనా?*

లిఫ్టులు పూర్తి భవనానికి ఏ మూలల్లోనూ వుండకూడదు. ఇంటికి ప్రక్కగానీ, ఎదురుగా గానీ కూడా రాకూడదు.

*హెచ్.శ్రీధరరెడ్డి — హైదరాబాద్*

** ఉత్తరం వీధి. ఎవరిపేర రిజిస్టర్ చేయమంటారు?*

ఉత్తరం బుధుడు నపుంసక స్థానం, ఆధిపత్యం రీత్యా కుబేరుడు అందువల్ల మీ శ్రీమతి పేరున అన్నివిధాలా కలసి వస్తుంది.

*ఎం.నాగచైతన్య — గూడూరు*

** ఎప్పుడూ కిటికీలు, తలుపులు తెరవక పోవడం వల్ల అరిష్టమా?*

గాలి, వెలుతురు, వేడిమి ప్రసార ప్రవాహాలు సవ్యంగా జరగడానికే తలుపులు, కిటికీల స్థానాలను గృహంలో వాస్తుపరంగా నిర్ధారిస్తారు. కారణమేదైనా అలా తెరవక పోవడం వల్ల గృహ మూతవేధో దోషాలు ప్రారంభమై రోగం, మానసిక అనారోగ్యం కలుగుతాయి.

# అంటువ్యాధులు కాని వాటి నియంత్రణకు పైలెట్ ప్రాజెక్ట్!

**జిల్లాలో అంటు వ్యాధులు కాని వ్యాధుల నియంత్రణకు రాష్ట్ర ప్రభుత్వం ప్రత్యేక పైలెట్ ప్రాజెక్ట్‌ను ఆరు మండలాల్లో చేపట్టనుంది.**

జిల్లాలో అంటువ్యాధులు కాని వ్యాధుల నియంత్రించేందుకు రాష్ట్ర ప్రభుత్వం శ్రీకారం చుట్టింది. ఇందుకోసం జిల్లాలోని ఆరు మండలాల్లో ఈ పథకాన్ని అమలు పర్చనుంది. ఈ పథకానికి అవసరమైన సిబ్బంది, వైద్యుల నియామకానికి సంబంధించి నోటిఫికేషన్ కూడా  విడుదల చేయడం జరిగింది. క్లస్టర్ కేంద్రాలు, పిహెచ్‌సి వైద్యులు, ఏఎన్ఎంల శిక్షణ కార్యక్రమం పూర్తి చేశారు. గతంలో కేవలం మధుమేహవ్యాధి సోకిన వారిని గుర్తించే కార్యక్రమం చేపట్టారు. జాతీయ మధుమేహవ్యాధి నియంత్రణ పథకం ద్వారా ఈ కార్యక్రమం జరిగింది.

ఈ పథకం జిల్లాలో విజయవంతంగా జరగడంతో తాజాగా అంటువ్యాధులు కాని వ్యాధుల నియంత్రణ (నాన్ కమ్యూనకబుల్ డిసీజ్) పథకాన్ని పైలెట్ ప్రాజెక్టుగా చేపట్టాలని ప్రభుత్వం నిర్ణయించింది. షుగర్, బి.పి, పక్షవాతం, క్యాన్సర్ వ్యాధులను అంటువ్యాధులు కానివిగా నిర్ధారించి వీటి నియంత్రణ కోసం వైద్యశాఖ కృషి చేసే విధంగా మార్గదర్శకాలు రూపొందించారు. రాష్ట్రంలో నెల్లూరు జిల్లాతోపాటు విజయనగరం జిల్లాలో కూడా ఈ ప్రాజెక్టు అమలు కానుంది. మన జిల్లాలో ఉదయగిరి, కావలి, పొదలకూరు, కోట, నాయుడుపేట మండలాల్లో తొలి దశలో అమలు చేస్తారు.

ఈ పథకం అమలు కోసం కోటి 50లక్షల రూపాయలు విడుదల చేస్తారు. జిల్లాస్థాయిలో ప్రాజెక్టు అధికారి, మండల స్థాయిలో క్లస్టర్ అధికారులు, పిహెచ్‌సి వైద్యులు, ఎఎన్ఎంలు విధులు నిర్వహిస్తారు. మొత్తం పనితీరును వైద్యవిధాన పరిషత్ కో-ఆర్డినేటర్, జిల్లా వైద్య ఆరోగ్యశాఖాధికారి పర్యవేక్షించే విధంగా ఉత్తర్వులు జారీ అయ్యాయి. గుర్తించిన మండలాల్లో వైద్యులు, ఎఎన్ఎంలు గ్రామీణ ప్రాంతాలలో పర్యటించాల్సి వుంటుంది. ప్రతి ఇంటిని సర్వే చేసి కుటుంబ సభ్యులకు వైద్య పరీక్షలు నిర్వహించాలి.

ప్రజల నుంచి సేకరించిన రక్త నమూనాలను వ్యాధుల నిర్ధారణ కొరకు జిల్లాప్రభుత్వ ప్రధాన వైద్యశాలకు పంపాల్సి వుంటుంది. వ్యాధి సోకిన వారు నెలకోసారి వైద్యులను సంప్రదించి చికిత్స చేయించుకోవాలి. వీరికి అవసరమైన మందులన్నీ కూడ సమీప ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల్లో ఉచితంగా పంపిణీ చేస్తారు. ఈ పథకం క్రింద నియమించబడిన సిబ్బందికి ఇతర బాధ్యతలను అప్పగించరు. గ్రామాలలో వైద్య సిబ్బంది సర్వేచేసి అందజేసిన నివేదికలపై కో-ఆర్డినేటర్, జిల్లా వైద్య ఆరోగ్యశాఖాధికారి తనిఖీ చేసి వాస్తవాలను తెలుసుకుంటారు.



**కొత్త పథకానికి జిల్లా వైద్య ఆరోగ్యశాఖ వెన్నుదన్నుగా నిలిచేనా?**

గ్రామీణ ప్రాంతాల్లో సదస్సులు ఏర్పాటు చేసి అంటువ్యాధులు కాని వ్యాధుల గురించి అవగాహన కల్పించి ప్రతి ఒక్కరు వైద్య పరీక్షలు చేయించుకొనేందుకు సిద్ధం చేస్తారు. ముందుగా గుర్తించిన మండలాల్లో ఈ పథకం ఫలితాలు సాధిస్తే మిగిలిన అన్ని మండలాల్లో దీనిని అమలు చేసే అవకాశం వుంది.



కల్తీ... కల్తీ

# పెచ్చుపెరిగిన పెట్రోల్, డీజిల్ కల్తీ!

**జిల్లాలోని పెట్రోల్ బంకుల్లో పెట్రోల్, డీజిల్ కల్తీ మరీ ఎక్కువయ్యింది. దీన్ని అరికట్టే అధికారి లేకపోవడం వల్ల అంతిమంగా ప్రజలు నష్టపోవాల్సి వస్తోంది.**




**నాణ్యత సరిలేని పెట్రోల్ బంకులు.**

జిల్లాలోని పలు పెట్రోల్ బంకుల్లో పెట్రోల్, డీజిల్ కల్తీ జరుగుతుంది. రోజురోజుకు ఇంధన వినియోగం అధికం కావడం ఇందుకు కారణంగా పేర్కొనవచ్చు. కల్తీ చేసిన పెట్రోల్, డీజిల్‌ను వినియోగించిన వాహనాలు మరమ్మత్తులకు గురవుతున్నాయి. పెట్రోల్ కల్తీ చేసినందున ద్విచక్ర వాహనాలు మరమ్మత్తులకు గురికావడంతో సీజ్ అవుతున్నాయని వినియోగదారులు ఎంత మొత్తుకున్నా పట్టించుకునే దిక్కు లేకుండా పోయారు.

భారత పెట్రోలియం, ఇండియన్ ఆయిల్ కార్పొరేషన్, హిందూస్థాన్ పెట్రోలియం కార్పొరేషన్ల ఆధ్వర్యంలో పెట్రోల్ బంకులు ఏర్పాటు చేయబడ్డాయి. ఈ పెట్రోల్ బంకుల్లో నాణ్యతాప్రమాణాలు పాటిస్తున్నారా? లేదా అని సంబంధిత పెట్రోలియం కార్పొరేషన్ల అధికారులు నిత్యం పర్యవేక్షణ చేయాల్సి వుంటుంది. నాణ్యతా ప్రమాణాలను పరీక్షించే సమయంలో అధికారితోపాటు వినియోగదారులు కూడా వుండాలన్న నిబంధన వుంది. అయితే ఎవరి సమక్షంలోనూ పరీక్ష చేయకుండానే చేసినట్లు పెట్రోల్ బంకు వద్ద ఒక బోర్డును ఏర్పాటు చేసేస్తున్నారు నిర్వాహకులు.

ఏర్పాటుచేసిన బోర్డులో ఏదో ఒక వినియోగదారుని పేరు కూడా నమోదు చేస్తున్నారు. వాహనాలకు పెట్రోల్, డీజిల్ నింపే సమయంలో కొలతలు కూడా చాలా వ్యత్యాసంగా వుంటున్నాయి. లీటర్ పెట్రోల్ నింపుకుంటే ఇందులో 75శాతం మాత్రమే వుంటుందని వాహనదారులు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. అంతేకాకుండా మైలేజ్ కూడా తక్కువ వస్తుంది. వాహన కంపెనీల డీలర్లను సంప్రదిస్తే కల్తీ చేయబడిన పెట్రోల్ వాడినందున మైలేజ్ తగ్గడంతోపాటు మరమ్మతులకు గురవుతున్నాయని చెబుతున్నారు.

నాణ్యతాప్రమాణాలు, కొలతల్లో వస్తున్న తేడా గురించి ఎవరైనా వినియోగదారుడు ప్రశ్నిస్తే పెట్రోల్‌బంకు సిబ్బంది దురుసుగా సమాధానం చెబుతున్నారు.

## గ్రామీణ ప్రాంతాల్లో...

పెట్రోల్ బంకుల్లో నాణ్యతా ప్రమాణాలు, కొలతలు సక్రమంగా వుండవు. దీనిని ఆసరా చేసుకున్న కొందరు వ్యాపారులు గ్రామీణ ప్రాంతాల్లో రహదారుల వెంబడి  బాటిల్స్‌లో పెట్రోల్ నింపి అధిక ధరలకు విక్రయించి సొమ్ము చేసుకుంటున్నారు. పెట్రోల్ బంకులో లీటర్ పెట్రోల్ రూ.70.50పైసలు అదే పెట్రోల్ గ్రామీణ ప్రాంతాల్లోని రహదారుల వెంబడి ఏర్పాటు చేసిన దుకాణాలలో 75 నుంచి 80 రూపాయల వరకు విక్రయిస్తున్నారు.

ఇక్కడ విక్రయించే పెట్రోల్‌లో 50శాతం కిరోసిన్ కలిపి కల్తీ చేస్తుంటారు. ప్రభుత్వ నిబంధనల ప్రకారం అనుమతి లేకుండా పెట్రోల్ విక్రయించకూడదు. గ్రామీణప్రాంత ద్విచక్రవాహనదారుల అవసరాలను అవకాశంగా తీసుకొని కొందరు వ్యాపారులు ఇటువంటి మోసాలకు పాల్పడుతున్నారు. బహిరంగంగానే రోడ్డుప్రక్కన పెట్రోల్, డీజిల్ క్యాన్లను వుంచుతున్నారు. ప్రతి అధికారికి ఈ విషయం తెలిసినా నియంత్రించేందుకు చర్యలు తీసుకోకపోవడం విశేషం.



## రాటుదేలిన దీపికా...



చిత్రసీమలో కాలిడి నాలుగు సంవత్సరాలే అయినా హీరోయిన్ దీపికా పదుకొణే కావాల్సినంత పేరు తెచ్చుకొంది. రణబీర్ కపూర్‌తో ఆమె సాగించిన ప్రేమ వ్యవహారం కావల్సినంత ప్రచారం తీసుకొచ్చింది. ఈ మధ్య పారిశ్రామికవేత్త విజయ్ మాల్యా తనయుడు సిద్ధార్థ మాల్యాతో చెట్టాపట్టాలేసుకొని సందడి చేసింది. ఐపిఎల్ మ్యాచ్‌లో అందరూ చూస్తుండగా అతనికి ముద్దులు పెట్టి మరోసారి వార్తల్లోకెక్కింది. ఆమెపై విమర్శలు ఎక్కువవడంతో నాకెవరూ సలహాలు ఇవ్వనక్కరలేదు. నేనెవరికీ సలహాలు ఇవ్వనంటుంది. నా విషయాల్లో సిద్ధార్థమాల్యా తలదూర్చడు. సొంత నిర్ణయాలు తీసుకొంటుంటాను. మంచి కథ దొరికితే రణబీర్ కపూర్‌తో సినిమా చెయ్యటానికి ఎటువంటి అభ్యంతరం లేదని చెబుతూ తానెంత రాటుదేలిపోయానో లోకానికి చాటి చెప్పింది దీపికా.

## గెలుపే సమాధానం!

చిత్ర పరిశ్రమలో అన్నింటికీ గెలుపే సమాధానమంటుంది హీరోయిన్ కత్రీనా కైఫ్. కత్రీనాకు నటన చేతకాదు, భాష రాదు, రాణించడం కష్టం. తొందరలోనే తిరుగుటపా తప్పదన్నారు. అయితే అన్నింటినీ తట్టుకొని నిలబడ్డాను. చివరికి అన్ని విషయాలకు నా గెలుపే సమాధానం చెప్పింది. ఇదెలా సాధ్యమయ్యింది అంటే; సినీపరిశ్రమలో గెలుపు ఓటమి ఇవన్నీ మామూలే. వాటి నుంచి ఏం నేర్చుకొన్నాం అనేదే ప్రధానం. చిత్రసీమలోనికి ప్రవేశించిన తొలినాళ్లలో ఎదుర్కొన్న అవహేళనకు భయపడి పారిపోయి వుంటే అందరూ నన్ను మర్చిపోయేవారు. ఆరోజుల్లో కొందరు దర్శకులు, నటీనటులు ఎంతో ధైర్యాన్ని ఇవ్వబట్టే నేనీస్థాయికి చేరుకొన్నానంటుంది కత్రినా.



## తెలుగమ్మాయిగా అలరిస్తా!



మర్యాద రామన్న చిత్రంలో హీరోయిన్‌గా నటించి మంచి గుర్తింపు తెచ్చుకొన్న సలోనికి వెంకటేష్, బాలకృష్ణల సరసన నటించే ఛాన్స్ వచ్చింది. వెంకటేష్ హీరోగా నటించే బాడీగార్డ్ షూటింగ్ గ్యాప్‌లో పిచ్చాపాటీగా మాట్లాడింది. నేను పోషించే పాత్రలో ఎక్కువ అభినయం, కాస్త గ్లామర్ వుండాలని కోరుకొంటాను. అంతే కానీ విపరీతంగా అందాలు ఆరబోసే పాత్రలో నటించడం నాకు నచ్చదు. కథలో భాగంగా అందాలు ఆరబోస్తే అర్ధముంది. అంతేకానీ ప్రత్యేకంగా అందాలు ప్రదర్శన కోసమే సన్నివేశాలు సృష్టిస్తే అతకదు. బికినీ వేసుకొని నటించడం నాకు నప్పదు. పైగా అంత సౌకర్యంగా కూడా వుండదు. ఓ ప్రక్క కోపంగా మరోవంక సరదాగా ఇలా ఒకే చిత్రంలో భిన్నభావోద్వేగాలు వుండే పాత్రలు పోషించాలని ఆశ. తెలుగమ్మాయి చిత్రంలో ఝాన్సీరాణిగా నటించడం మర్చిపోలేని అనుభూతి. తెలుగమ్మాయిలో నా నటన ప్రేక్షకులను అలరిస్తుందంటుంది సలోని.

## తమిళంలో నరేష్



అల్లరి నరేష్ హాస్యకథానాయకుడు మాత్రమే కాదు అభినయ ప్రధానమైన పాత్రలు చేసి మెప్పించగల నటుడని గమ్యం, శంభో శివ శంభో, విశాఖ ఎక్స్‌ప్రెస్ చిత్రాలు చాటి చెప్పాయి. శంభో శివ శంభో చిత్రంలో నరేష్ నటనకు ఆ చిత్ర దర్శకుడు సముద్రఖని ఆయన అభిమానిగా మారారు. నరేష్‌తో పోరాళి అనే తమిళచిత్రం తీయను ఉపక్రమించాడు. దీనిలో కలర్స్ స్వాతి కథానాయిక. పోరాళి సెట్స్‌మీద వుండగానే నరేష్‌కు మరికొన్ని తమిళ చిత్రాల్లో అవకాశాలొచ్చాయి. తెలుగులో బిజీగా వుండడంతో వాటికి గ్రీన్‌సిగ్నల్ ఇవ్వలేదు.

## ఆరబోత తప్పదు



యువత చిత్రం ద్వారా వెండితెరపై మెరిసిన భామ అక్ష. ఈ చిత్రం తర్వాత రైడ్, అదినువ్వే చిత్రాల్లో నటించింది. తాజాగా విడుదలైన కందిరీగ చిత్రం తనకు బ్రేక్‌నిస్తుందని ఆశాభావాన్ని వ్యక్తం చేసింది. చిన్ననాటి నుంచి ఇప్పటి వరకు 150కిపైగా ప్రకటనల్లో నటించిన అనుభవమున్న ఈ భామ సినిమాల్లో అందాల ఆరబోతపై మాట్లాడుతూ గ్లామర్ ప్రపంచంలో ఇది సాధారణమైన విషయం. బాలీవుడ్‌లో పెద్దపెద్ద తారలు కూడా బికినీలు వేస్తున్నారు. గ్లామర్‌తో ముడిపడ్డ పరిశ్రమలో గ్లామర్‌ని నమ్ముకోవడం తప్పుకాదు. నేటితరం అభిరుచులకు అనుగుణంగా కనిపించాలన్నదే నా అభిమతం. మంచికథలు ఎంచుకొని మంచి హీరోయిన్‌గా స్థిరపడాలన్నదే తన కోరికంది.



## దడ... బడ!

✍ అల్లూరు రహీం

నెల్లూరీయుడు, చిత్రపరిశ్రమలో ప్రముఖ నిర్మాతగా గుర్తింపు తెచ్చుకొన్న డి.శివ ప్రసాద్‌రెడ్డి శ్రీ కామాక్షి ఎంటర్ ప్రైజెస్ పతాకంపై నాగచైతన్యను హీరోగా పెట్టి తీసిన చిత్రం దడ. ఈ సినిమాకెళ్లిన ప్రేక్షకులను దడ పుట్టిస్తుంది. ఏ మాయ చేసావె, 100% లవ్ చిత్రాలను తన విజయ ఖాతాలో వేసుకొని వుండిన నాగచైతన్య కెరీర్‌ను ధ్వంసం చేసిన చిత్రం దడ. ఈ చిత్రానికి నూతన దర్శకుడు అజయ్ భూయాన్ కథ, స్క్రీన్‌ప్లేతోపాటు దర్శకత్వం బాధ్యతలు నిర్వహించాడు. కథ, కథనం సరిగ్గా నడపను దర్శకునికి చేతకాక పోవడంతో ఈ చిత్రం చతికిల బడింది. విదేశాల్లో చిత్రీకరణ, అందమైన హీరోయిన్ కాజల్, దేవిశ్రీ ప్రసాద్ సంగీతం, అబ్బూరి రవి మాటలు, పెద్ద విలన్లు సినిమాలో వున్నా థియేటర్‌లోకి వెళ్లిన ప్రేక్షకులు ఎప్పుడు బయటకు వచ్చేద్దామా అనే ఫీలింగ్‌ను ఈ చిత్రం కల్గిస్తుంది. ఈ చిత్రంలో తాను పోషించిన పాత్ర తనకే కొత్తగా అనిపించిందని హీరో నాగచైతన్య చెప్పడం బట్టి ఈ చిత్రం స్థాయిని అట్నే అర్థం చేసుకోవచ్చు. ఈ చిత్రంలో హీరోహీరోయిన్ల మధ్య పుట్టే ప్రేమను విస్తృతపర్చడం దర్శకునికి చేతకాలేదు. ఒంటరితనాన్ని అనుభవిస్తుండే హీరోయిన్ పరిచయమైన మరుసటి రోజుకే హీరో బైకెక్కి మందు కూడా కొట్టేయడం కాస్త విడ్డూరమనిపిస్తుంది. చిత్రంలో ఇద్దరు అండర్ వరల్డ్ డాన్లు వుంటారు. వీరు మాటలు తప్ప చేతల్లో తమ దాదాగిరిని చూపరు. చిత్రంలో ఫ్యామిలీ సెంటిమెంట్ పండలేదు. సాహిత్యాన్ని ఖూనీ చేసిన దేవిశ్రీ ప్రసాద్ పాటలు చిత్రాన్ని ఇంకాస్త నీరసపరిచాయి. ఏ పిల్ల... చరణంతో సాగే ఒకేపాట బాగుంది. మాటల మాంత్రికుడు అబ్బూరి రవి మనసును తాకే మాటలు వ్రాయలేదు. ఆడవాళ్లు జీవితం ఇస్తారు... వారికోసం ఏమైనా చేయాలి తప్ప... దడలో గొప్ప డైలాగేమి లేదు. చిత్ర ప్రారంభంలో హీరో చేసిన ఫైట్ బాగున్నా, కార్ రేసింగ్‌ను సరిగ్గా చూపలేక పోయారు. నెల్లూరీయుడై నెల్లూరోళ్లను కిండల్ చేసే డైలాగులు నిర్మాత వ్రాయించడం బాగోలేదు. బ్రహ్మానందం, అలీ, వేణుమాధవ్, ఎం.ఎస్.నారాయణల కాంబినేషన్‌లోని హాస్య సన్నివేశాల్లో పస లేదు.

చిత్ర కథలోనికి వెళ్తే రాజు (శ్రీరామ్) తమ్ముడు విశ్వ (నాగచైతన్య). డిగ్రీ పూర్తి చేశాక విదేశం నుంచి విశ్వ ఇండియాకు వెళ్లాలని ఆలోచిస్తుంటాడు. ఆడవాళ్లను అంతర్జాతీయంగా అమ్మే ముఠా నాయకులు ఆర్.డి (రాహుల్ దేవ్), కెల్లీ (కెల్లీ డోర్జి) లకు ఎదురు నిలచి 100 మంది అమ్మాయిలకు విశ్వ విముక్తి కల్పిస్తాడు. దీంతో విశ్వను చంపాలని అండర్ వరల్డ్ వ్యాపారాలు చేసే విలన్లు తుది నిర్ణయానికి వస్తారు. తన తండ్రి (ముఖేష్‌రుషి) తల్లిని చంపేయడంతో ఏమి చేయలేని అసహాయ స్థితిలో వుండే రియా(కాజల్) చనిపోవాలని నది దగ్గరకు వెళ్తుంది. ఈమె దూకుడు చూసి కారులో వెనుకబడే విశ్వకు ఈత రాకున్నా ఆమెను కాపాడను నదిలో దూకేస్తాడు. చివరికి రియానే అతడిని రక్షిస్తుంది. అప్పటి నుంచి అడపాదడపా వీరు కలుస్తుంటారు. ఆర్‌డి తన దగ్గర పని చేసే రాజుకు విశ్వను అంతమొందించే పని అప్పగిస్తాడు. దీంతో విశ్వను ఏవిధంగానైనా ఇండియా పంపాలను కొంటాడు రాజు. కాని విశ్వ దానికి సిద్ధపడకపోగా విలన్లకు మనమంటే దడ పుట్టాలని అన్నతో భీకర ప్రతిజ్ఞ చేసి వారిని అంతమొందించడంతో చిత్రం ముగుస్తుంది.




చిత్రంలో నాగచైతన్య తన పాత్ర వరకు బాగానే పోషించాడు. అందంగా వుండే కాజల్‌కు ప్రత్యేక విగ్ పెట్టడం వల్ల ఆమె వికారంగా తయారయ్యింది. పాత్రలు బలంగా లేకపోవడం వల్ల మిగతానటుల నటనను విశ్లేషించనక్కర లేదు. నాగచైతన్యకు ఏం మేలు చేకూర్చను శివప్రసాద్‌రెడ్డి ఈ చిత్రం తీసారో అర్థమేకావడం లేదు.



రాజరాజేశ్వరమ్మ దేవస్థానంలో వరలక్ష్మీవ్రతం చేస్తున్న మహిళలు.

## కిటకిటలాడిన దేవాలయాలు

శ్రావణ శుక్రవారం వరలక్ష్మీవ్రతాన్ని పురస్కరించుకొని నెల్లూరు నగరంలోని దేవాలయాలు మహిళా భక్తులతో పోటెత్తాయి. దర్గామిట్టలోని రాజరాజేశ్వరమ్మను శాకాంబరిదేవిగా అలంకరించారు. వివిధ రకాల కూరగాయలు, పండ్లతో అమ్మవారిని, ఆలయ మండపాన్ని అలంకరించారు. ఉదయం అభిషేకాలు, కుంకుమార్చనలు, అష్టోత్తర, శత, సహస్ర నామ పూజలు చేశారు. ఆలయ ప్రాంగణంలోని ప్రత్యేక మండపంలో అమ్మవారిని వుంచి మహిళలు సామూహికంగా వరలక్ష్మి వ్రతాన్ని చేశారు. స్టోన్‌హౌస్‌పేటలోని కన్యకాపరమేశ్వరి ఆలయంలో అభిషేకం, పూలంగిసేవ నిర్వహించారు. నెల్లూరు గ్రామదేవత ఇరుగాళమ్మ దేవస్థానంలో కుంకుమార్చనలు, పూలంగి సేవ జరిగాయి. మూలపేటలోని మూలస్థానేశ్వరాలయం, దర్గామిట్టలోని శబరి శ్రీరామక్షేత్రం, ఉస్మాన్‌సాహెబ్‌పేట నాగేశ్వరాలయంలో ప్రత్యేక పూజలు జరిగాయి. వేలాదిగా మహిళలు ఆలయాలకు తరలి రావడంతో ఆలయాలు కిటకిటలాడాయి. రాత్రి పది గంటల వరకు ఈ భక్తజన సందడి కొనసాగింది.

## దొంగ జామీన్‌దారులు

కోర్టులో బెయిల్ పొందేందుకు పలువురు జామీన్ ఇస్తుంటారు. దీనినే ప్రధాన వృత్తిగా చేసుకొని దొంగ జామీన్లు ఇచ్చే నకిలీ ముఠాలు పెరిగి పోయాయి. న్యాయాన్ని, ధర్మాన్ని కాపాడాల్సిన కోర్టులకు ఈ నకిలీ జమీనుదారుల వల్ల తీవ్ర నష్టం వాటిల్లుతోంది. ఎవరిపైన అయినా కేసు నమోదైన తర్వాత బెయిల్ కోసం జామీన్ ఇవ్వాల్సి వుంటుంది. జామీన్ ఇచ్చే వ్యక్తుల ఆస్తిపాస్తులు, ఉద్యోగ వివరాలు కోర్టు పరిగణలోనికి తీసుకొంటుంది. విచారణ సమయంలో నిందితుడు కోర్టుకు హాజరుకాకపోయినా, పరారైనా జామీనుదారులదే బాధ్యత. దీనిని ఆసరా చేసుకొని నకిలీ జామీనులు ఇచ్చే ముఠా ఒకటి తయారైంది. నకిలీ పాసు పుస్తకాలు, రేషన్ కార్డులు, శిస్తు కాగితాలు, నివాస ధృవీకరణ పత్రాలు వంటి వాటిని చేత పుచ్చుకొని కోర్టు ఆవరణలో తిరుగుతూ ఎవరికైనా జామీను కావాలంటే ఐదువేల నుంచి పదివేల రూపాయల వరకు కేసును బట్టి తీసుకొని జామీను ఇచ్చేస్తుంటారు. నిత్యం వందలాది కేసులతో తలమునకలై వుండే కోర్టులకు ఇవి నకిలీవా, నిజమైనవా అని గుర్తించే సమయం వుండక పోవడంతో ఈ నకిలీ జామీనుదారులు అధికమయ్యారు. ఇలాంటి జామీనులు తీసుకొని బెయిల్‌పై బయటకు వచ్చిన నిందితులు పరారవుతుండడంతో, సమన్లు పంపినపుడు, ఆయా చిరునామాలకు వెళ్లినప్పుడు అసలు విషయం బట్టబయలౌతోంది. మహిళలు, పురుషులతో కూడిన ఈ ముఠా జిల్లా కోర్టు వద్ద తమ కార్యకలాపాలు సాగిస్తున్నట్లు సమాచారం. రెవిన్యూ, పోలీస్ అధికారులు ఇలాంటి ముఠాలపై తగిన చర్యలు చేపట్టకుంటే న్యాయవ్యవస్థకు అన్యాయం జరుగుతుందని పలువురు వ్యాఖ్యానిస్తున్నారు.

**కోర్టులకే టోకరా**



అంతర్జాతీయ వెటరన్ క్రీడాకారుడు డాక్టర్ మండవ శ్రీధర్‌రావును స్వాతంత్ర్య దినోత్సవపు వేడుకల్లో సత్కరిస్తున్న మంత్రి ఆనం రామనారాయణరెడ్డి. చిత్రంలో ఎమ్మెల్యే శ్రీధర్‌కృష్ణారెడ్డి, ఎమ్మెల్సీ వాకాటి నారాయణరెడ్డి, జాయింట్ కలెక్టర్ సౌరభ్‌గౌర్, కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి, డిఆర్వో రామిరెడ్డి వున్నారు.



నెల్లూరు వేదాయపాళెంలోని లిల్లీ లిటిల్ ఫ్లవర్ హైస్కూల్‌లో జరిగిన స్వాతంత్ర్య దినోత్సవపు వేడుకల్లో పిల్లల గౌరవ వందనాన్ని స్వీకరిస్తున్న స్కూల్ కరస్పాండెంట్ ఇ.సి.నారాయణరెడ్డి.

## కాలువల కబ్జాతో ఇబ్బంది

నగరంలో కాలువలన్నీ కబ్జాకు గురౌతున్నాయి. ఈ కారణంగా డ్రైనేజి సమస్యతో ప్రజలు అవస్థలు పడుతున్నారు. కొద్దిపాటి వర్షానికే డ్రైనేజి పొంగి పొర్లుతుండడంతో రోడ్లపై నడవాలంటేనే కష్టమౌతోంది. కాల్వలు ఆక్రమణలకు గురౌతున్నా సంబంధిత శాఖాధికారులు పట్టించుకోకపోవడంతో ఇవి అధికం అవుతున్నాయి. ఒకనాడు నగర వాసులకు ప్రయోజనకరంగా వున్న పంట కాల్వలు క్రమేణా కనుమరుగౌతున్నాయి. నెల్లూరు చెరువుకు అనుసంధానంగా వ్యవసాయం కోసం ఈ కాలువలను ఏర్పాటుచేసినా కాలక్రమేణా ఇవి డ్రైనేజి కాలువలుగా మారిపోయాయి. నగర జనాభా పెరగడం, దానికి తగినట్లుగా డ్రైనేజి వ్యవస్థను మెరుగుపరచక పోవడంతో పెద్ద సమస్యగా మారింది. నగర జనాభా అవసరాలకు వినియోగించే నీటి కారణంగా రోజుకు 51.98 మిలియన్ లీటర్ల మురుగునీరు విడుదలవుతుందని అంచనా. వీటిలో సగం కూడా కాలువల్లో ముందుకు వెళ్లని పరిస్థితి ఎదురౌతుంది ఆక్రమణల కారణంగా. నగరంలో దాదాపు 14 పైగా పంట కాలువలున్నాయి. ఉయ్యాల కాలువ, రామిరెడ్డి కాలువ, సర్వేపల్లి కాలువ, గుర్రాలమడుగు సంఘం కాలువ, జాఫర్‌సాహెబ్ కాలువ, హరనాథపురం బ్రాంచి కెనాల్ తదితర కాలువలున్నాయి. వీటిలో ఒకటి రెండు కాలువలు తప్ప మిగతావన్నీ ఆక్రమణలకు గురైనాయి. దీనివల్ల మురుగు నీరుపోయే మార్గంలేక రోడ్ల పైకి పొంగి పొర్లుతుండడంతో నగరవాసులు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. పాలకులు, ప్రజలకు అన్ని కోట్ల నిధులు తెస్తున్నాం, సుందరంగా తీర్చిదిద్దుతామని చెప్పడం తప్ప అభివృద్ధి చేస్తున్న దాఖలాల్లేవు.



గచ్చుకాలువ ఆక్రమణకు గురైన దృశ్యం.



వేలూర్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇంజనీరింగ్ విద్యార్థులచే రోబోటిక్స్ మీద నిర్వహించిన వర్క్‌షాపులో పాల్గొన్న సరస్వతినగర్ రత్నం హైస్కూల్ విద్యార్థులను అభినందిస్తున్న డిఇఓ రామలింగం. ప్రక్కన విద్యాసంస్థల జిఎం రామ్మూర్తినాయుడు, హెడ్ ప్రిన్సిపల్ మైఖేల్ సుకుమార్.

## దోమలు బాబోయ్ దోమలు

దోమలు నగరంలో విజృంభిస్తున్నాయి. పారిశుద్ధ్యం అధ్వాన్నంగా వుండడం, దోమల నివారణకు మునిసిపాలిటీ ఎలాంటి చర్యలు చేపట్టక పోవడంతో నగర వాసులపై పడి తమ ప్రతాపాన్ని చూపిస్తున్నాయి. ఎక్కడికక్కడ పొంగిపొర్లుతున్న మురుగునీరు, ఇళ్ల మధ్య నిలుస్తున్న నీరు తదితర కారణాలతో దోమలు అంతకంతకు పెరిగి పోతున్నాయి. ఎప్పుడో ఏడాదికో శివరాత్రికో అన్న చందంగా తూతూ మంత్రంగా దోమల మందును అతిగా స్ప్రే చేయడం తప్ప దోమల నివారణకు సక్రమంగా తీసుకొంటున్న చర్యలు శూన్యం. దీంతో నానాటికీ దోమల బెడద అధికంగా వుంటోంది. వర్షాలు పడడంతో వీటి వ్యాప్తి ఉధృతంగా వుంటోంది. ఎండ వేడిమిని కూడా తట్టుకొని ఇవి మనుగడ సాగించడం విశేషం. దోమలే కదా కుడితే కుట్టాయిలే అనే పరిస్థితి వుండడం లేదు. వీటి వల్ల వచ్చే ప్రాణాంతక వ్యాధులు ప్రజలను ఆందోళనకు గురి చేస్తున్నాయి. ఎనాఫిలిస్ అనే దోమ వల్ల మలేరియా వ్యాధి వస్తుంది. ఇది ఒకరి నుంచి మరొకరికి వ్యాపించే వ్యాధి. క్యూలెక్స్ దోమ వల్ల మెదడువాపు వ్యాధి (జపనీస్ ఎన్‌సెఫలైటిస్) వంటి ప్రాణాంతక వ్యాధులు కలుగుతాయి. అలాగే డెంగ్యూ, చికున్‌గున్యా, ఫైలేరియా కారకాలు దోమలే. ఈ కారణంగా దోమల బారి నుంచి రక్షణ పొందేందుకు పాత పద్ధతులను మాని సరికొత్త పద్ధతుల వైపు వెళ్లడం వల్ల జేబులకు చిల్లు తప్పడం లేదు.



పారుదల లేని కాలువలే దోమల ఆవాసాలు.



జొన్నవాడలోని ప్రియదర్శిని వృద్ధాశ్రమంలో ఆగష్టు 15ను పురస్కరించుకొని జాతీయ జెండాను ఎగురవేస్తున్న మహిళా కాంగ్రెస్ జిల్లా అధ్యక్షురాలు పందిళ్లపల్లి అరుణమ్మ.

## జగన్‌కు తోడెవరు?

16వ పేజీ కొరవ

కాగితం మీద సంతకం పెట్టేయడం అలవాటా మెకు. దానివల్ల ఆమె వందల కోట్ల రూపాయల అక్రమ ఆర్జన పోగేసుకొన్నారు. ఇప్పుడు దానికి ప్రతి ఫలం అనుభవించవలసిన సమయం ఆసన్నమైనది.

వీరు కాక, మాజీ ప్రధాన కార్యదర్శి రమా కాంత్‌రెడ్డి, వైఎస్ పర్సనల్ కార్యదర్శి జన్నత్ హుస్సేన్, సిఎం పేషీ కార్యదర్శి భాను, మునిసిపల్ కార్యదర్శి ఎస్పీ సింగ్, రెవెన్యూ కార్యదర్శి శామ్యూల్, ఫైనాన్స్ కార్యదర్శి శేఖర్‌బాబు, నీటిపారుదల శాఖ కార్యదర్శి సివిఎస్‌కె.శర్మ, ఫైనాన్స్‌కే చెందిన టిటిడి మాజీ ఇఓ ఐవైఆర్.కృష్ణారావు, జెన్‌కో ఎండిగా పని చేసిన అజయ్ జైన్, ప్రాథమిక వసతుల విభాగాధి పతి మన్మోహన్‌సింగ్, విద్యుత్‌శాఖ కార్యదర్శి సుతీర్థ భట్టాచార్య, సమాచార శాఖ కార్యదర్శి పార్థసారథి వంటి ఐఎఎస్ అధికారులు చాలామందే సిబిఐ బోనులో చిక్కుకొంటారని చెప్తున్నారు. వైఎస్ కాలంలో జరిగిన ప్రజాధనం దోపిడీకి అధికార ముద్ర వేసిన అధికారులు కావడమే అందుకు కారణం.

నీటిపారుదల, పరిశ్రమల శాఖలు నిర్వహిం చిన పొన్నాల లక్ష్మయ్య, బొత్స సత్తిబాబులకు కూడా ప్రమాదం తప్పక పోవచ్చునన్నది ఒక అం చనా.

## జనవాణి

2వ పేజీ కొరవ

### సర్దార్ పటేల్ పేరు పెట్టడం బాగుంది!

నెల్లూరు నగరంలోని రిత్విక్ ఎన్‌క్లేవ్ ప్రాంతానికి సర్దార్ వల్లభాయ్ నగర్ అని పేరు పెట్టడం బాగుంది. దీనికి బిజెపి నేత వెంకయ్య నాయుడు సూత్రధారి కావడం సంతోషం. దేశంలో తొలితరం నేతలైన గాంధీ, నెహ్రూ, నేతాజి, శాస్త్రి సరసన నిలబడిన నాయకుడు పటేల్. నెల్లూరులో ఆయన విగ్రహం ఏర్పాటుకు కూడా వెంకయ్యనాయుడు కృషి చేయమనవి.

వాస్తు రామచంద్ర నెల్లూరు

## సిబిఐకి అంత తొందెందుకు?

మొదటి పేజీ కొరవ

దృష్టిలో కూడా పడ్డాయి. ఒసామా బిన్ లాడెన్ తెర మీదకు వచ్చిన తర్వాత, అమెరికా నిఘా బృందాలు ప్రపంచవ్యాప్తంగా భారీ స్థాయిలో జరిగే ధన లావా దేవీలపై ఒక కన్ను వేస్తున్నాయి. అటువంటి సొత్తు ఇస్లామిక్ తీవ్రవాదుల ఖాతాలోకి వెళ్తాయేమోననే శంకతో, పెద్ద మొత్తంలో జరిగే ప్రతి లావాదేవీనీ ఎఫ్‌బిఐ నిశితంగా పరిశీలించి ఆయా దేశాలకు ఎప్పటికప్పుడు సమాచారం ఇస్తున్నది. జార్ఖండ్ మాజీ ముఖ్యమంత్రి మధు కోడా దొరికింది కూడా అమెరికన్ నిఘా సంస్థల సమాచారంతోనే అన్న సంగతి ఇక్కడ గమనార్హం. అట్లనే జగన్ మీద కూడా అమెరికన్ సంస్థలు ఎన్‌ఫోర్స్‌మెంట్ డైరెక్టరే ట్‌కు సమాచారం ఇచ్చాయని, దాన్ని సిబిఐకి చేరవే శారని, దానితో వారు లోలోపల దర్యాప్తు జరిపా రని, కానీ రాజకీయంగా వచ్చే ప్రభావాలకు జడిసి ఇంతకాలం వేచి చూశారని చెప్తున్నారు. ఇప్పుడు హైకోర్టు తీర్పు ఆసరా దొరికింది కాబట్టి, ఒక్క క్షణం కూడా ఆలస్యం చేయకుండా రంగంలోకి దిగేశా రని, అప్పటికే పూర్తి సమాచారం తమ వద్ద వుంది కాబట్టి, వెతుకులాట లేకుండా బొంబాయి, రాంచి వంటి దూర ప్రాంతాలలోని జగన్ వ్యాపార కార్య కలాపాలపై కూడా వెంటనే దాడులు జరపగలి గారని తెలుస్తున్నది. వారు నిజంగా హైకోర్టు తీర్పు తర్వాత మాత్రమే దర్యాప్తుకు పూనుకొని వుంటే, ఇన్ని వందల కార్యాలయాల చిరునామాలు సేక రించడానికే నెలల కాలం కావాలి.

అయితే జగన్ అభిమానులు మాత్రం ఈ వాదనను అంగీకరించడం లేదు. హైకోర్టు తీర్పు మీద జగన్ సుప్రీంకోర్టుకు వెళ్లాడు కాబట్టి, ఏ కారణం చేత అయినా ఆ అత్యున్నత న్యాయస్థానం స్టే మంజూరు చేస్తే, దర్యాప్తు విఫలమైపోతుంది కాబట్టి, ఆ లోగానే సోదాలు పూర్తి చేయాలన్న తొందరతో వ్యవహరించారని వీరు భావిస్తున్నారు. రాజకీయ అవినీతి మీద సుప్రీంకోర్టు గత కొంత కాలంగా అనుసరిస్తున్న కఠినవైఖరిని బట్టి చూస్తే, జగన్‌కు అక్కడ ఉపశమనం దొరుకుతుందని ఎవరూ భావించలేరు. కానీ దాని వల్ల కొంత ఆలస్యమయ్యే అవకాశం మాత్రం వుంది. ఆ ఆలస్యాన్ని నివారించ డానికే సిబిఐ అంత తొందర పడిందన్నది ఒక అంచనా.

సిబిఐకి అంత తొందరెందుకు? రాజకీ యంగా దీనివల్ల ఎవరికీ పెద్ద ఉపయోగం లేదు. జగన్‌ను అర్జెంట్‌గా జైలులో పెట్టినందువల్ల కాంగ్రెస్ పార్టీకి కానీ, కేంద్రంలోని సోనియా ప్రభు త్వానికి కానీ వచ్చే ప్రయోజనమేదీ లేదు. ఎన్నిక లకు మూడేళ్లకు పైగా వ్యవధి వుండడమే అందుకు కారణం. ఎన్నికలు ఏడాది ప్రాంతంలోకి వచ్చి నప్పుడు జైలు ప్రయోగం చేస్తే, ఆయన్ను రాజకీ యంగా దెబ్బ తీసే వీలు వుంటుంది. ఇప్పుడు ఒక వేళ జైలులో పెట్టినా ఎన్నికల నాటికి నిక్షేపంగా బయటకు వచ్చేస్తాడు కాబట్టి, పెద్దగా ప్రయోజనం వుండదు. హైకోర్టు తీర్పు వచ్చిన తర్వాత జగన్ జాగ్రత్త పడే అవకాశం వుంది కాబట్టి, త్వరగా సోదాలు చేశారా? అదీ నిజం కాకపోవచ్చు. తన మీద దాడులు జరుగుతాయన్న నిజం జగన్‌కు చాన్నాళ్ల ముందే తెలుసు. పడే జాగ్రత్త ఏదో ఏడాది క్రితమే పడి వుంటాడన్నది వాస్తవం. ఇప్పుడు కొత్తగా దాచి పెట్టుకోవాల్సింది ఏదీ వుండదు. ఈ తొందరపాటుకు కారణం ఇవి రెండూ కారణాలు కావు. నిపుణులు చెప్పేదాన్ని బట్టి, అంతర్జాతీ యంగా జగన్ హవాలా లావాదేవీలపై అమెరికన్ సంస్థలు చేస్తున్న ఒత్తిడి వల్లనే కేంద్ర ప్రభుత్వ ఉన్నతాధికారులు సిబిఐని అంత త్వరపెట్టి వుం టారని తెలుస్తున్నది. తెలిసో తెలియకో జగన్ విదే శాలతో చేసిన హవాలా లావాదేవీలలో కొంత భాగం తీవ్రవాద అనుకూల సంస్థలలోకి వెళ్లడమే ఇప్పుడు ప్రమాదకర విషయమని చెప్తున్నారు.

ఏది ఏమైనా సిబిఐ కనీసం సుప్రీంకోర్టు విచారణ వరకు నిగ్రహం పాటించి వుంటే, దీని మీద రాజకీయ దుమారం చెలరేగడానికి ఆస్కారం వుండేది కాదు. కానీ ఇప్పుడు కేవలం ఢిల్లీ పెద్దల ఒత్తిడి వల్లనే సిబిఐ వారి చేతిలో పావు వలె వ్యవహరించిందనే నింద కేంద్ర ప్రభుత్వం మీద పడుతున్నది.

## ఆనమోల్ల ఆక్రోశం

మొదటి పేజీ కొరవ

ఈ మాటకు జగన్ వర్గమే కాదు, సాక్షాత్తూ జగన్ కూడా మనసు నొచ్చుకొన్నాడని తెలుస్తున్నది.

జగన్ రాజకీయాలు వైఎస్‌తో సన్నిహితంగా మెలిగిన చాలామంది కాంగ్రెస్ వాదులకు నచ్చడం లేదు. కానీ వారిలో అత్యధికులు జగన్‌ను అకార ణంగా విమర్శించడానికి ఇష్టపడడం లేదు. జగన్‌ను తిడితే, వైఎస్‌ను తిట్టినట్లే అన్న భావనే అందుకు కారణం. మరీ తప్పదనుకొన్నప్పుడు ధర్మాన ప్రసాద రావు, రఘువీరారెడ్డి వంటి వారు జగన్ రాజకీ యాలను మాత్రమే పరామర్శించి తప్పుకొంటు న్నారు. అయితే ఆనం సోదరులు మాత్రం ఆ నిగ్ర హం పాటించడం లేదు. ఆయనేదో తమకు ఆగర్భ శత్రువన్నట్లుగా శాపనార్థాలు పెడుతున్నారు.

ఈ పోకడకు ఏకైక కారణం – ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డిని మచ్చిక చేసుకోవడం మాత్రమే. ఒకవేళ కిరణ్ మంత్రివర్గ విస్తరణ జరిపితే, తమ ఆర్థిక శాఖ గోవిందా కొడుతుందన్న భయం వారిలో వుంది. దాన్ని కాపాడుకోవాలంటే ముఖ్యమంత్రి మెప్పు పొందాలి. మరొక ప్రక్క తమకెంతో ప్రియ మైన భానుశ్రీకి లైటు కారున్న పదవి ఇప్పించడం కోసం రోశయ్య కాలం నుంచి కొంగ జపం చేస్తు న్నారు. దాన్ని నెరవేర్చుకోవాలి. ఆ రెండు పనులు జరగాలంటే ముఖ్యమంత్రి తమను శభాష్ అనాలి. ఆ బలహీనతతో వైఎస్ కుటుంబం పట్ల అంత కృత ఘ్నులుగా ప్రవర్తిస్తున్నారు సోదరులిద్దరూ. రాజకీ యాలలో అవకాశాలు తప్ప, అనుబంధాలు వుండ వన్నది నిజమే అయినప్పటికీ, అన్నం పెట్టిన చెయ్యిని నరికేంత క్రూరంగా ప్రవర్తించడం మాత్రం జగన్ అభిమానులందరినీ బాధిస్తున్నది.

## నెల్లూరు ముచ్చట్లు

3వ పేజీ కొరవ

కమిటీ ఇచ్చిన నివేదికను అమలు చేసిన వారే లేరని, క్రాప్ హాలిడే అంశంపై కేంద్ర, రాష్ట్ర ప్రభు త్వాలు సీరియస్‌గా ఆలోచించాలని వెంకయ్య నాయుడు సలహా ఇచ్చారు.

### కలెక్టర్ కుమారునికి ఆపరేషన్!

కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి కుమారుడు విశాఖప ట్నంలో బిటెక్ చదువుతున్న సాయి శ్రీపాద్‌కు 13వ తేది పెద్దాసుపత్రిలో టాన్సిల్స్ ఆపరేషన్ చేయిం చారు. కార్పొరేట్ వైద్యం చేయించే స్థోమతవున్నా పెద్దాసుపత్రిలోనూ చక్కని వైద్యం చేస్తారని తెలి పేందుకు కలెక్టర్ గారు ఈ ఆపరేషన్ చేయించి నట్లుంది. ఈ ఆపరేషన్ చేసిన వైద్యుడు డాక్టర్ రమ ణయ్య నగరంలో చేయి తిరిగిన సర్జన్.

### రాష్ట్రస్థాయి కవితల పోటీ

నెల్లూరులోని సృజన సాహిత్య సాంస్కృతిక వేదిక రాష్ట్రస్థాయిలో కవితల పోటీ నిర్వహిస్తుంది. 25 పంక్తులకు తగ్గకుండా 35 పంక్తులు మించని వచన, పద్య కవితలను ఆగష్టు 31వ తేదీలోగా దగ్గుపాటి రాధాకృష్ణ, 12/447 దోర్నాలవీధి, సంత పేట, నెల్లూరు – 1, చిరునామాకు పంపమంటు న్నారు. వివరాల కోసం 77990 76909 నెం బరుకు ఫోను చేయవచ్చు.

### అవార్డులపై విమర్శలు

స్వాతంత్ర్య దినోత్సవం సందర్భంగా వివిధ శాఖల్లో విధి నిర్వహణలో అంకిత భావంతో పనిచేసిన వారికి అవార్డులు ఇవ్వడం పరిపాటి. ఈ అవార్డులకు చేసే ఎంపికలో అవకతవకలు జరుగు తున్నాయనే దానిపై విమర్శలు వ్యక్తం అవుతు న్నాయి. ప్రతి సంవత్సరం ఒకరే అవార్డులు తీసు కోవడం, గ్రూపులు, రాజకీయాల ప్రాతిపదికన ఎం పికలు జరుగుతుండడంపై గగ్గోలు రేగుతుంది. అధిక భాగం సమర్థులకే అవార్డులు అందినా, కొన్ని శాఖల్లో ఇలాంటివి జరుగుతుండడం ప్రతిభ వుండి అవార్డుల మొఖం ఒక్కసారి చూడనివారు లోలోన కుమిలి పోతున్నారు.

### ఎల్ఎల్ఎఫ్‌లో ఆగష్టు 15

నెల్లూరు వేదాయపాలెంలోని లిల్లీ లిటిల్ ఫ్లవర్ స్కూల్‌లో స్వాతంత్ర్య దినోత్సవపు వేడుకలు ఘనంగా జరిగాయి. స్కూల్ కరస్పాండెంట్ ఇసి నారాయణరెడ్డి జాతీయ పతాకావిష్కరణ అనంతరం విద్యార్థులు మార్చ్‌ఫాస్ట్ నిర్వహించారు. అనంతరం 2010 – 11 విద్యా సంవత్సరంలో పదవ తర గతిలో స్కూల్ ప్రథమ, ద్వితీయ, తృతీయ స్థానాలు కైవసం చేసుకొన్న విద్యార్థులకు జ్ఞాపికలు, నగదు బహుమతులను స్కూల్ డైరక్టర్ ఇ.కృష్ణచైతన్య అం దించారు.

### కాన్‌స్టెల్లో లండన్ మెన్స్‌వేర్‌లో తగ్గింపు

రంజాన్, శ్రావణ మాసాలను పురస్కరించు కొని నెల్లూరు పొగతోటలోని కాన్‌స్టెల్లో లండన్ మెన్స్‌వేర్‌లో రెడీమేడ్ గార్మెంట్స్‌పై రెండు కొంటే ఒకటి ఉచితం ఆఫర్ అమలు చేస్తున్నట్లు నిర్వాహ కులు చెప్పారు. షర్ట్, ప్యాంట్స్, టీ షర్ట్, సూట్స్‌లో ఒకటి కొంటే 25 తగ్గింపు ఆఫర్ అందుబాటులో వుంది. వస్త్ర ప్రేమికులను ఈ అవకాశాన్ని వినియో గించుకోమంటున్నారు.

### మిస్టర్ ఆంధ్రాగా నెల్లూరు అబ్బాయి

భీమవరంలో జరిగిన బాడీ బిల్డింగ్ పోటీల్లో నెల్లూరుకు చెందిన జయపాల్ మిస్టర్ ఆంధ్రాగా నిలిచాడు. రాష్ట్రవ్యాప్తంగా వివిధ ప్రాంతాలకు చెం దిన బాడీ బిల్డర్లు పాల్గొన్న ఈ పోటీల్లో జయపాల్ ఈ గౌరవాన్ని పొందడం పట్ల మాజీ మిస్టర్ ఇండియా శేషయ్య తదితరులు అతన్ని అభినందిం చారు. త్వరలో జరుగనున్న మిస్టర్ ఇండియా పోటీల్లో పాల్గొని ఆ టైటిల్‌ను కైవసం చేసుకోవా లని ఆకాంక్షించారు.

### ఆనందరెడ్డికి పుత్ర వియోగం

ఆంధ్రప్రదేశ్ లోకాయుక్త జస్టిస్ సురే ఆనంద రెడ్డి కుమారుడు అమెరికాలో సాఫ్ట్‌వేర్ ఇంజనీర్‌గా పనిచేస్తున్న సురే ప్రశాంత్ (31) గతవారం మరణిం చారు. ఆనందరెడ్డి స్వగ్రామం కావలి రూరల్ మండలం గౌరవరంలో 14వ తేదీ ఆయన అంత్య క్రియలు జరిగాయి. ఆర్థిక మంత్రి ఆనం రామ నారాయణరెడ్డి 14తేది జస్టిస్ ఆనందరెడ్డిని పరా మర్శించారు. కన్న బిడ్డను కోల్పోయిన జస్టిస్ ఆనందరెడ్డికి మా ప్రగాఢ సానుభూతి.

# ఉపాధి కల్పనలో విఫలమవుతున్న గ్రామీణాభివృద్ధి సంస్థ!

**జిల్లాలోని నిరుద్యోగులకు జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థ, ఐకెపి, జిల్లా పరిశ్రమల కేంద్రం, ఎస్సీ కార్పొరేషన్ తదితర శాఖల నేతృత్వంలో శిక్షణకు పంపుతున్నారు తప్ప ఇది పూర్తయిన వారికి ఉపాధి అవకాశాలు కల్పించడంలో విఫలమవుతున్నారు.**

జిల్లాలోని నిరుద్యోగ యువతీ, యువకులకు వివిధ వృత్తుల్లో చేరేందుకు అవసరమైన శిక్షణనిస్తున్నా, ఉపాధి అవకాశాలు కల్పించడంలో మాత్రం అధికారులు వైఫల్యం చెందుతున్నారు. ఉపాధి అవకాశాలు దక్కుతాయన్న ఉద్దేశంతో చెన్నై, హైదరాబాద్ వంటి నగరాలకు వెళ్లి శిక్షణ పొందిన వారున్నారు. జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థ, ఐ.కె.పి జిల్లా పరిశ్రమల కేంద్రం, ఎస్సీ కార్పొరేషన్ తదితర శాఖల ఆధ్వర్యంలో నిరుద్యోగులకు శిక్షణ కార్యక్రమాలు ఏర్పాటు చేయడం జరుగుతోంది. అయితే శిక్షణ పూర్తి చేసుకున్న వారు ఎక్కడా ఉపాధి అవకాశాలు దొరక్క ఇక్కట్లు పడుతున్నారు.

శిక్షణ కోసం వచ్చే వారికి అన్ని సదుపాయాలు కల్పించడంతోపాటు శిక్షణ పూర్తి చేసిన తర్వాత వివిధ కార్పొరేట్ సంస్థలలో ఉపాధి చూపిస్తామని ఇచ్చిన భరోసా ఆచరణలో పెట్టలేక పోతున్నారు. శిక్షణ ఇప్పిస్తున్న శాఖలలో జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థ ప్రధానమైంది. ఈశాఖ మిగిలిన శాఖల కంటే అధిక మొత్తంలో నిధులు ఖర్చు చేయడం జరుగుతోంది. నిరుద్యోగులకు ఉపాధి అవకాశాలు కల్పించేందుకు ప్రత్యేకవిభాగాన్ని కూడా ఏర్పాటు చేశారు. “ఎంప్లాయిమెంటు మార్కెటింగ్ జనరేషన్” అనే విభాగం కార్పొరేట్ సంస్థలతో సంప్రదింపులు జరిపి ఇంటర్వ్యూలు ఏర్పాటు చేయాల్సి వుంటుంది.

కేవలం శిక్షణ ఇప్పించేందుకే పరిమితమై పోవడంతో శిక్షణ పొందేందుకు నిరుద్యోగ యువతీ, యువకులు ముందుకు రావడం లేదు. జిల్లాలో ఇటీవల కాలంలో వివిధ పరిశ్రమలు ఏర్పాటు కాగా, మరికొన్ని పరిశ్రమలు ఏర్పాటు దశలో వున్నాయి. ఈ పరిశ్రమలతో ముందుగానే ఒప్పందం కుదుర్చుకొని అవసరమైన సిబ్బంది నియామకం కోసం ఏ అధికారి కూడా ప్రయత్నాలు చేయడం లేదు. ఇతర పట్టణాలు, నగరాల్లో వున్న సంస్థలలో ఉద్యోగావకాశాలు కల్పిస్తామని మాత్రం ప్రకటనలు గుప్పిస్తున్నారు. కంప్యూటర్, ఎలక్ట్రికల్, ఫిట్టర్, డీజిల్ మెకానిక్, ఎంబ్రాయిడరీ తదితర వృత్తి విద్యా కోర్సులలో శిక్షణ పొందిన వారు అనేక మంది వున్నారు.

ప్రతి సంవత్సరం ఈ శిక్షణా కార్యక్రమాలు ఏర్పాటుచేస్తున్నా ఉపాధి అవకాశాలు కొద్ది మందికే లభిస్తున్నాయి. ఉద్యోగ, ఉపాధి అవకాశాల కోసం ఎంపిక సమయంలో ప్రభుత్వ పరంగా శిక్షణ పొందిన వారికి తొలి ప్రాధాన్యతనివ్వాలి. అయితే బయట శిక్షణ పొందిన వారికే ప్రాధాన్యతనిచ్చి ఎంపిక చేయడం వలన తాము తీవ్రంగా నష్టపోతున్నామని నిరుద్యోగులు వాపోతున్నారు. ప్రభుత్వపరంగా ఇచ్చే శిక్షణా కార్యక్రమాలకు గ్రామీణ ప్రాంత యువతకు ప్రాధాన్యతనివ్వాల్సి వుండగా, పట్టణ ప్రాంత వారే వీటిని దక్కించుకుంటున్నారు. దీంతో ప్రభుత్వ లక్ష్యం, సంకల్పం పూర్తిగా నెరవేరకుండా పోతున్నాయి. వివిధ శాఖల ఆధ్వర్యంలో ప్రతి సంవత్సరం లక్షలాది రూపాయలు వ్యయం చేసి నిరుద్యోగులకు వివిధ శిక్షణ కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. శిక్షణ పూర్తి చేసుకున్నవారు నేటికీ నిరుద్యోగులుగానే మిగిలిపోయారు. ప్రతి సంవత్సరం ఎంతమందికి శిక్షణ ఇస్తున్నారు? వీరిలో ఎంతమంది ఉపాధి అవకాశాలు పొందారన్న సమాచారం అధికారుల వద్ద లేదు. జిల్లా కలెక్టర్ వీటిపై ప్రత్యేక దృష్టి సారించి శిక్షణ పొందిన వారికి ఉపాధి అవకాశాలు కల్పించేందుకు కృషి చేయాల్సిన అవసరం వుంది.



పేరుకే గ్రామీణాభివృద్ధి సంస్థ.

## • మానవ మనస్తత్వపు

# అవలక్షణాలను ఎండగట్టే మరిగే తారు సరోవరం!




వందేళ్ల తెలుగు కథాపరిణామ క్రమంలో సమాజంలోని యథాతథ వాస్తవాన్ని ప్రతిబింబించిన కథలు చాలా అరుదు. ఈ క్రమంలో సమాజంలో దైనందిన జీవనంలో జరిగే ఘోరాలు, నేరాల నేపథ్యంగా మానవ మనస్తత్వంలోని విభిన్న కోణాలను ఆవిష్కరించి ఎస్.గణపతిరావు రచించిన కథాసంపుటి “మరిగే తారు సరోవరం”. ఈ సంపుటిలోని పది కథలు పాఠకుడ్ని ఒక రకమైన ఉద్వేగానికి గురి చేస్తాయి. బహుముఖ స్పందనలు కలుగజేస్తాయి. అంతిమంగా ఆలోచనకు దారితీస్తాయి. ఇటీవల కాలంలో వెలువడ్డ కథల్లో విభిన్నమైన కథలివి. ఈ కథల్లో రచయిత వాడిన ప్రతీకలు, వర్ణనలూ అప్పుడప్పుడూ పాఠకులను సంభ్రమాశ్చర్యాలకు గురి చేస్తాయి. ఇందులో వున్నవి పది కథలే అయినా ఇవి సమాజంలోని అదనపు సంపాదనలో అవకాశవాదులుగా మారిన ఎందరో మనుషుల మనస్తత్వంలోకి పరకాయ ప్రవేశంచేసి మానవ మనస్తత్వపు అవలక్షణాలను నగ్నంగా మన ముందు నిలబెడుతాయి. పతితలూ, భ్రష్టులూ, బాధసర్పద్రష్టుల జీవితాలు, సమాజంలో ఒక వర్గ స్వార్థ ప్రయోజనాల మూలంగా గురయ్యే పరిణామాలను రచయిత ఈ పది కథల్లో ఆసక్తికరంగా చిత్రించాడు. నిజానికి పది కథల్ని వివరంగా పరిచయం చేయాలంటే పెద్ద వ్యాసమే రాయాల్సిన అవసరం వుంది. కథల గొప్పదనానికి ఎన్నో శాస్త్రీయ విశ్లేషణలు వున్నప్పటికీ ప్రాథమిక ప్రాతిపదికన కథ పాఠకుడ్ని చదివింపజేయాలి. తనతోపాటు పాఠకుడ్ని హిప్నాటిక్ ట్రాన్స్‌లోకి ఈడ్చుకుపోవాలి. ఆ లక్షణం ఈ కథల్లో పుష్కలంగా వుంది. గణపతిరావు కథల్లో కథాకథన నిర్మాణానికి నాటకీయత అక్కడక్కడా శృతిమించినా ఈ పది కథలూ పాఠకుడ్ని విడవకుండా చదివిస్తాయి. చాలా కాలానికి మంచి కథలు చదివామనే తృప్తిని మిగులుస్తాయి. మరిగే తారు సరోవరం కథల్లో ఇతివృత్తాలు పది రకాలైనా వీటన్నింటి అంతఃసూత్రం ఒకటే. ఈ పది కథల్లోని పాత్రల హృదయ వేదన వెనుక నేటి సమాజంలోని వికృత, ఆర్థిక, రాజకీయ, సామాజిక, సాంస్కృతిక, సమకాలీన జీవన నేపథ్యం వుంది. వీటికి కథకుడి లక్ష్యశుద్ధి, శిల్పపరమైన నేర్పు తోడై పాఠకుల్ని ఏకబిగిన చదివింపజేస్తూనే ఆలోచింపజేస్తాయి. ఇందులోని పది కథలూ ఏవీ వాస్తవ దూరమైన వూహలతో లేవు. అన్నీ సమకాలీన సమాజపు వాస్తవికతను ప్రతిబింబిస్తూ పాఠకుల హృదయాన్ని రసార్థం చేస్తాయి. వ్యవస్థలో నానాటికీ పేరుకపోతున్న నిర్లిప్తత, నిస్సహాయత్వం వాటిపై అవకాశవాద, స్వార్థ పరశక్తులు సాగిస్తున్న దాష్టీకాన్ని, దౌర్జన్యాన్ని గణపతిరావు ప్రతిభావంతంగా చిత్రీకరించాడు. అవమానాలు, పోరాటాలు, త్యాగాలతో మహాత్ములు సాధించిన స్వాతంత్ర్య విలువను తన పది కథల్లో రచయిత తూకం వేసిన తీరు సమర్థవంతంగా వుంది. అస్తమానమూ రాయలసీమ కరువు, స్త్రీవాదం వంటి స్టీరియోటైప్ యాంత్రిక కథలతో విసుగెత్తిన ఆంధ్ర పాఠక జనాన్ని ఈ కథలు రిలీఫ్ చేస్తాయి. తరచూ రాయగలిగితే గణపతిరావు మరో మంచి రచయితగా పాఠకులకు చేరువవుతాడు. కేవలం కథలే కాదు ఈ సంపుటిని అందంగా అచ్చువేయడంలోనూ రచయిత చూపిన శ్రద్ధ అభినందనీయం. అయితే మల్టీకలర్ ముఖచిత్రాలను తగ్గించి పుస్తకం ధర ఇంకా తగ్గించి వుంటే సామాన్య పాఠకులకు కూడా ఈ పుస్తకం అందుబాటులో వుండేది.



**మరిగే తారు సరోవరం**
కథల సంపుటి
రచయిత : **ఎస్.గణపతిరావు**
సమీక్షకుడు : **డాక్టర్ లెనిన్ ధనిశెట్టి**
పేజీలు : 172

**- : ప్రతులకు : -**
విశాలాంధ్ర బుక్‌హౌస్ – (అన్ని బ్రాంచీలు)
నవోదయ బుక్‌హౌస్ – హైదరాబాద్
ఎస్.గణపతిరావు, 26/1 కావేరి స్ట్రీట్
సాలిగ్రామం, చెన్నై – 93.

# జైలులో జగన్‌కు తోడెవరు?

**మంత్రులు:**

సబితా ఇంద్రారెడ్డి
మోపిదేవి వెంకటరమణ

**ఐఏఎస్‌లు:**

బిపి.ఆచార్య, శ్రీలక్ష్మి, రమాకాంత్‌రెడ్డి, జన్నత్ హుస్సేన్, ఐవైఆర్.కృష్ణారావు, సివిఎస్‌కె.శర్మ, శామ్యూల్, భాను, అజయ్ జైన్, సుతీర్థ భట్టాచార్య, పార్థసారథి, మన్మోహన్‌సింగ్, ఎస్పీ సింగ్.

**ప్రమాదం అంచులో వున్న వారు:**

బొత్సా సత్తిబాబు
పొన్నాల లక్ష్మయ్య

జగన్‌తో పాటుగా సిబిఐ కేసులో ఎవరెవరు ఇరుక్కొంటారనే ప్రశ్న ఇప్పుడు అందరిలో ఆసక్తి కల్గిస్తున్నది. రాష్ట్ర ప్రభుత్వ ఖజానాను తిలా పాపం తలా కొంచెం అన్నట్లు ఎంతో మంది కలిసి దోచుకొన్నారు. ఒక్కొక్క రంగంలో ఒక్కొక్క వర్గం వ్యాపారులు, అధికారులు భాగం తీసుకొన్నారు. ఎస్ఇజడ్‌లు, రియల్ ఎస్టేట్ భూముల దోపిడీ ఒక వర్గానిది. నీటిపారుదల కాంట్రాక్ట్ పనుల నిలువు దోపిడీ మరొక వర్గానిది. పన్నుల ఎగవేత, హైదరాబాదులో భూముల క్రమబద్ధీకరణ మరొక వర్గానిది. ఓడరేవులు, విమానాశ్రయాలు ఇంకొక వర్గానిది. గనులది ప్రత్యేకంగా ఒక వర్గం. రోడ్లు కొల్లగొట్టినవారు వేరొకరు. ఇట్లా పలు తరగతులు, వర్గాలకు చెందిన వ్యాపారులు, పారిశ్రామికవేత్తలు వైఎస్ ప్రభుత్వ హయాంలో ప్రయోజనాలు పొందారు. వీటిలో ఇప్పుడు కేవలం జగన్ కంపెనీలలో పెట్టుబడులు పెట్టినవారి మీద మాత్రమే సిబిఐ దర్యాప్తు నడుస్తున్నది. హైకోర్టు కేసులో ఆ ఒక్క అంశమే ప్రధానంగా వుంది కాబట్టి, దర్యాప్తు కూడా దానికే పరిమితమౌతున్నది. వైఎస్ కాలంలో జరిగిన మొత్తం దోపిడీతో పోలిస్తే, ఇప్పుడు సిబిఐ వెలికి తీయబోతున్న అక్రమాల మొత్తం సముద్రంలో నీటి బొట్టంత మాత్రమే.

ఈ కొంచెంలో కూడా ఎంతో మంది ఐఎఎస్ అధికారుల పాత్ర వుంది. కొంత మంది మంత్రులు కూడా ఇరుక్కోబోతున్నారు. వారిలో ప్రధానంగా విన్పిస్తున్నది, సబితా ఇంద్రారెడ్డి, మోపిదేవి వెంకటరమణల పేర్లు. వైఎస్ కాలంలో సబితా ఇంద్రారెడ్డి చాలాకాలం మైనింగ్ మంత్రిగా పని చేశారు. ఆమె హయాంలోనే గాలి జనార్దనరెడ్డి కంపెనీలకు ఇనుప ఖనిజం గనుల కేటాయింపు జరిగింది. వాటిద్వారానే గాలి సోదరులు వేల కోట్ల సామ్రాజ్యాలు నిర్మించుకొన్నారు. అందులో కొంత జగన్‌కు పెట్టుబడిగా పెట్టారు. గాలి వారి అవినీతి గనులను సిబిఐ త్రవ్వడం మొదలు పెడితే, సబితా ఇంద్రారెడ్డి ఇరుక్కోవడం ఖాయమని నిపుణులు చెప్తున్నారు.

రెండవ మంత్రి మోపిదేవి వెంకటరమణ ఆ కాలంలో ప్రాథమిక వసతులు, పెట్టుబడుల శాఖ మంత్రిగా పని చేశారు. ఎస్ఇజడ్, పారిశ్రామిక వాటికలు, ఓడరేవులు, విమానాశ్రయాలు వంటి వాటికి భూముల కేటాయింపు, పలురకాల పన్నుల మినహాయింపు, రిజిస్ట్రేషన్ రద్దు వంటి సౌకర్యాల కల్పన ఈ శాఖ ద్వారానే జరిగాయి. అందువల్ల ఇప్పుడు జగన్ కంపెనీలలో పెట్టుబడులు పెట్టి దొరికిపోయిన పారిశ్రామికవేత్తల ఫైళ్లన్నిటిలో మోపిదేవి సంతకాలు వున్నాయని చెప్తున్నారు. ఆయన పీకల లోతు వరకు ఇరుక్కోవడం ఖాయమన్నది అంచనా.

అధికారులలో, ఎపిఐఐసి అధినేతగా పని చేసిన బిపి.ఆచార్య ఇప్పటికే బోనులో చిక్కాడు. ఆయన ఇంట్లో సోదాలు జరిగాయి. అరెస్టు చేసి జైలులో పెట్టడం ఇక లాంఛన ప్రాయమే. ఆయన వెంట జైలుకు నడవవలసిన స్థితిలో చిక్కుకొన్న వారిలో గతంలో మనకు కలెక్టర్‌గా పనిచేసిన శ్రీలక్ష్మి ఒకరని తెలుస్తున్నది. ఇనుప ఖనిజం, చీమకుర్తి గ్రానైట్, కడప ముగ్గురాయి, విశాఖపట్నం బాక్సైట్, బయ్యారం గనుల వంటి వాటిలో ఆమె సంతకాలు లెక్కకు మించి వున్నాయి. వైఎస్ చెప్తే చాలు, తెల్ల

కొరవ 14వ పేజీలో

# పాపం... చంద్రబాబు!

అన్నా హజారే అవినీతి నిరోధ ఉద్యమంలో ప్రధాన భూమిక పోషించడం ద్వారా యువతరం మనసులు చూరగొనాలని తెలుగుదేశం అధినేత చంద్రబాబు నాయుడు చేసిన ప్రయత్నం పూర్తిగా విఫలమైపోయింది. ఢిల్లీలో అన్నా హజారేను అరెస్టు చేసిన వెంటనే పార్టీ ఆఫీసు నుంచి 8 కిలోమీటర్ల దూరంలోని అంబేద్కర్ విగ్రహం వరకు పాదయాత్ర సంకల్పించారాయన. అన్నా పట్ల జనంలో పెల్లుబుకుతున్న అభిమానం, ఆదరణ దృష్ట్యా తాను జెండా భుజాన వేసుకొని వీధిలోకి వస్తే తన వెంట వేల సంఖ్యలో జనం నడుస్తారనే భ్రమతో, సరైన ఏర్పాట్లు కూడా లేకుండా యాత్ర మొదలు పెట్టాడు. కానీ విచిత్రంగా హైదరాబాద్ నగరవాసులు ఆయన యాత్రను పట్టించుకోలేదు. అన్నాకు తమ మద్దతు తెలపడానికి ఎవరికివారు ఏర్పాటు చేసుకొన్న చిన్న చిన్న కార్యక్రమాలకు వందల సంఖ్యలో జనం స్వచ్ఛందంగా వచ్చి కలిశారు. కానీ చంద్రబాబు పర్యటనలో కాలు కలపడానికి మాత్రం యువతరం ఇష్టపడలేదు. పక్కరోజు ధర్నా కార్యక్రమం కూడా అట్లానే విఫలం చెందింది.

ఇందుకు ప్రధానంగా రెండు కారణాలు కల్పిస్తున్నాయి. మొదటిది – అన్నా ఉద్యమంలో రాజకీయవాదుల ప్రమేయాన్ని జనం ఇష్టపడకపోవడం. రాజకీయవాదులందరి మీద జనానికి రోత పుట్టి వున్న మాట వాస్తవం. చంద్రబాబు మిస్టర్ క్లీన్ కాడు కదా? రెండవ కారణం – బాబు పట్ల ప్రజలలో ఇంకా అభిమానం పెరగకపోవడం. వైఎస్ మరణం తర్వాత రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీ ఎంతగా గబ్బు పట్టిపోతున్నప్పటికీ, ప్రజలలో ప్రత్యామ్నాయ పార్టీగా తెలుగుదేశానికి గుర్తింపు లభించడం లేదు. రెండూ రెండే అన్న ధోరణిలో అటు కాంగ్రెస్‌ను ఇటు తెలుగు దేశాన్ని కూడా ఈసడించుకొంటున్నారు జనం. ఆ పరిస్థితికి అద్దం పట్టింది – చంద్రబాబు పాదయాత్ర వైఫల్యం.



Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com